# దుర్గాదాసు




రచయిత:

వ్యాకరణశిరోమణి,

పిసపాటి వెంకటేశ్వర్లు. బి. ఏ.,

ఆంధ్రోపాధ్యాయుడు:

వీరేశలింగాస్తికోన్నత పాఠశాల, రాజమండ్రి.

# దుర్గాదాసు

రచయిత:

సాహిత్య శిరోమణి, రాష్ట్రభాషాసాహిత్య విశారద, విద్వాన్
పీసపాటి వెంకటేశ్వరులు
ప్రధానాంధ్రోపాధ్యాయుడు, వి. టి. హెచ్. స్కూలు,
రాజమహేంద్రవరము.



అన్నపూర్ణగ్రంథమాల
రాజమహేంద్రవరము.

 1957 [వెల రు. 1-4-0
1-25 నయాపైసలు

ప్రతులు 1000
1957 సం||

ఇది
ప్రేమచందు రచనకు
స్వేచ్ఛానువాదము

ప్రకటించువారు :—
శ్రీ తిరుపతి వెంకటేశ్వర పబ్లికేషన్సు
రా జ మ ం డ్రి.

# కథాముఖము

భారతదేశ చరిత్రలో రాజపుత్ర వీరుల కొక ప్రత్యేకత యున్నది. అసమానమైన వీరత్వము - అకృత్రిమమైన ప్రభుభక్తి - అమోఘమైన పట్టుదల రాజపుత్ర వీరునకు ఆజానజమైన గుణములు. అందుకే, భారతీయహృదయమున రాజపుత్ర వీరున కున్న స్థానము సుస్థిరమైనది.

"మొగలాయి సామ్రాజ్యచక్రవర్తి ఔరంగజేబు మార్వారుదేశము ముట్టడించి జోధపురమును గుప్పిటఁ బట్టుకొనెను. వీరకేసరియగు దుర్గాదాసు ధైర్యచాతుర్యములతో జోధపురరాజవంశాంకురమును నిలఁబెట్టెను. ఔరంగజేబునకు దుర్గాదాసు ప్రక్కలో బల్లెమయ్యెను. ఆ చక్రవర్తి కుమారుఁడు దుర్గాదాసు విక్రమసౌజన్యములకు దాసుఁడయ్యెను. రాజపుత్ర స్థానమున కింత మేలుచేసిన దుర్గాదాసు కడకుఁ దనవారికే కానివాఁడయ్యెను. ఏమైనను, దుర్గాదాసు తన మాతృదేశరక్తి, తన ప్రభుభక్తి చరిత్రలో శాశ్వతము చేసికొనునట్లు ప్రవర్తించిన మహావ్యక్తి"

చరిత్ర సుందరమైన యీగాథను గైకొని శ్రీ పీసపాటి వేంకటేశ్వరులుగారు లలితోచితములైన యలఁతి యలఁతి మార్పులతో నీగ్రంథము సంతరించినారు. ఇది యథార్థమైన చరిత్రకు 'నవలా' రూపము నిచ్చిన చక్కని కూర్పు.

ఏతద్ గ్రంథరచయిత శ్రీ వెంకటేశ్వరులుగారు ఉభయ భాషా సాహిత్య ప్రవీణులు. హిందీ భాషా విశారదులు.

తెలుఁగు వచనములో ఈ రచయిత కలము ఒకానొక మెలఁకువ గుర్తించిన దనుట కీగ్రంథములోని రచన స్పష్టసాక్ష్యము పలుకుచున్నది.

చరిత్ర విషయకములగు నిట్టి గ్రంథములలోని శైలి సులభ సుందరముగా సాగవలయును. ఇక్కడ – ఓజోభూయిష్ఠత పాఠకుఁడు సహింపనేరఁడు. వాక్యములు సుదీర్ఘములు కాకుండవలయును. భావము వెంట వెంటఁదేట పడవలయును. వర్ణనములు మితిమీఱకుండవలయును. ఈ రచనా రహస్యములు శ్రీ వేంకటేశ్వరులుగారు చక్కఁగా గుఱుతించి యిందలి రచన ప్రసన్నసుందరము గావించిరి.

ఈ గ్రంథములో 'దుర్గాదాసు' విశిష్టగుణము నలుగడలఁ బ్రసరించుచుఁ బరిమళించుచుఁ బాఠకునకొక యొరవడి పెట్టుచున్నది. ఒకమాట: ఈ 'దుర్గాదాసు' సుప్రసిద్ధ రచయిత 'ప్రేమచందు' గ్రంథమునకు స్వేచ్ఛానువాద మను విషయము చెప్పినచోఁ దెలిసినది, చెప్పనిచో నాకుఁ దెలిసియుండదు. జాతీయమైన రచనలోని తీరుసొరు లట్టివి. ఇట్టి మనోహర రచనలు మిక్కిలి శ్రీ వేంకటేశ్వరులుగారి క్రొత్తకలమునుండి వెలువడి వెలుఁగు చూడఁగలవు.

హేమలంబ : ఉగాది
రాజమహేంద్రవరము } మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి.

# దుర్గాదాసు.

## (వీరకేసరి)

జోధపురమును యశోవంతసింహుఁడను మహారాజు పరిపాలించుచుండెను. ఆతని సేనాపతి ఆశాకరణుఁడు. ఆయన మహావీరుఁడు. మహారాజగు యశోవంతునకు ఆతనియందు గౌరవము హెచ్చు. ఈ వీరసేనాపతి జ్యేష్ఠపుత్రుఁడే దుర్గాదాసు. ద్వితీయపుత్రుఁడు యశకరణుఁడు.

క్రీ. శ 1605 వ సంవత్సరమున జరిగిన ఉజ్జయినీ మహాయుద్ధమున ఆశాకరణుఁడు మాయోపాయముచే చంపఁబడెను. ఆనాటికి దుర్గాదాసు వయస్సు 15 సంవత్సరములు మాత్రమే. మహారాజగు యశోవంతసింహుఁడు ఆ బాలుని ప్రవర్తనకు సంతసించి తన జ్యేష్ఠపుత్రుఁడగు పృథ్వీసింహునివలె ప్రేమింపనారంభించెను. తరువాత కొంతకాలమునకు మహారాజు దక్షిణదేశమునకు వెళ్ళవలసివచ్చెను. అప్పుడాయన యువరాజగు పృథ్వీసింహునకు రాజ్యభారము నప్పగించి దుర్గాదాసును సైన్యాధిపత్యమునందు అభిషేకించి తనతోఁగూడ తీసికొనిపోయెను. ఆనాడు దక్షిణదేశమును శివాజీప్రభువు పరిపాలించుచుండెను. మొగలుల నాతఁడు గడ్డిపరకలవలె నరుకఁగొట్టనారంభించెను. వారియుక్తిప్రవాహమునకు శివాజీ నడగొండయయ్యెను. ఎన్నివిధముల చూచినను మొగలుల పప్పులు శివాజీదగ్గఱ నుడుకలేదు. అందువలన యుక్తిశాలియగు

ఔరంగజేబు యశోవంతసింహుని దక్షిణదేశవిజయమునకుఁ బంపెను. యశోవంతుఁ డటకు చేరిన వెంటనే కొంతవఱకు కల్లోలము తగ్గినది. క్రమముగ శివాజీ యశోవంతులస్నేహము వృద్ధిగాఁజొచ్చినది. ఔరంగజేబు నుద్దేశ్యము శివాజీ నోడించుటగాని కల్లోలములడఁగుటగాదు. తన యుద్దేశ్యము విఫలమగుటతోడనే యాతఁడు యశోవంతు నచటనుండి వెనుకకు పిలిపించి కొంతకాలము లాహోరులో నుంచి తరువాత కాబూలునకు పంపివైచెను. కాబూలునందు నివసించు ముష్కర తురుష్కుల నణచుట అంత తేలికయయిన పనిగాదు. ఘోర యుద్ధము జరిగినది. యశోవంతునిపుత్రు లిరువురు దివంగతులయిరి. దుర్భరదుఃఖముతో అచటనుండి మహారాజు పెషావరు చేరినాడు.

ఆరోజులలోనే అజమేరులో విప్లవము చెలరేగినది. ద్రోహులనణచు భారము పృథ్వీసింహునిపైఁ బడినది. స్వల్పకాలముననే ఆతఁడు విప్లవమునణచివైచెను. ఈ వార్తను వినుటతోడనే కృత్రిమ స్వభావుఁడగు ఔరంగజేబు సంతోషము నభినయించుచు, బహుమానప్రదానమునకని పృథ్వీసింహుని ఢిల్లీపట్టణమునకు పిలువనంపి యచట విషలిప్తములగు వస్త్రములను కానుకగ నొసంగి యాతనిచే ధరింపఁజేసెను. క్రమక్రమముగ ఆవిషమాతని శరీరమునఁ బ్రవేశించి తుదకాతని ప్రాణముల నపహరించెను. ప్రభుభక్తి పరాయణులగు హైందవవీరులకు ఔరంగజేబొసఁగు బహుమానము లిట్టివియే.

ఔరంగజేబు మార్వారుదేశము నపహరింపవలయునని కోరుచుండెను. యశోవంత సింహునియం దాతనికి ఆంతరంగిక మగు క్రోధముగలదు. అందులకు కారణము రాజ్యాధికార ప్రాప్తికై ఔరంగజేబు సోదరు లొనరించిన పరస్పరయుద్ధము నందు యశోవంతుఁడు ఔరంగజేబునకు ప్రతిద్వంద్వియగు దారాపక్షము నవలంబించుటయే.

పృథ్వీసింహుడు మరణించిన పిమ్మట మార్వారుదేశ మును పాలించుటకొక మొగలు సుబేదారును ఔరంగజేబు పంపెను. యశోవంతసింహుఁడు దూరమున పెషావరులో నుండు టచ్చేత మార్వారుదేశమును స్వాధీనము చేసికొనుటకు ఔరంగ జేబునకు మంచి యవకాశము చిక్కినది. పృథ్వీసింహుని మరణ వార్త యశోవంతునకు పిడుగుపాటయినది. అశ్రుకలుషితమగు దృష్టిని ప్రక్కనున్న శోనింగునిపైఁ బరపి యశోవంతసింహుఁ డిట్లనెను. సోదరా! "ఈ ప్రియపుత్రుని మరణవార్త నాకొఱకు మృత్యుదేవత పంపిన యాహ్వానము. నేను మరణించుటకు ముందు నీయందొక గురుతరబాధ్యత నుంచవలయు ననుకొను చున్నాను." అని శోనింగుని లోనికి తీసికొనివెళ్ళి ఒక చిన్న ఇనుపరేకుతో చేసిన పెట్టెను ఆతని కందించుచు నిట్లనెను. "రాజ పుత్రవీరు డెవ్వాడయినను మొగలుల గర్వమునణచి మార్వారు సింహాసనము నధిష్ఠించువఱకు ఈ చిన్నపెట్టెను రక్షించుభారము నీయది. విధివిలాసమున నట్టి శుభదిన మేతెంచినయెడల ఆ వీరుని పట్టాభిషేక సమయమున ఆతనికి ఈ చిన్నపెట్టెను ఉప

హారముగ నొసంగుము. అంతపఱకు దీనినెవ్వరును తెలిపరాదని ప్రార్థన. ఒకవేళ అనివార్యములగు కారణములవలన నీవీ పేటికను కాపాడుటకు అసమర్థుఁడ వయినయెడల నేఁజెప్పిన విషయములను తెలియచేసి నేను నీకప్పగించినటులనే నీవుగూడ మరియొక విశ్వాసపాత్రుని కప్పగించుము"

రెండవరోజున మహారాజు తన సేనాపతుల నందఱను పిలిపించి సభచేసి యిట్లు ఉపన్యసించెను. "సోదరులారా! ఔరంగజేబు రాజపుత్రులయందు తనకున్న ప్రాతపగను కపటనీతిని ఊతగఁగొని సాధించియున్నాఁడు. రాజవంశము నిర్మూల మయినది. నేను మరణించిన తరువాత సింహాసనమున కధికారియగు వాఁడు ఇఁక లేడు. కాని నారాణులలో భాటీదేవి, హాడీదేవి అనువారు ప్రస్తుతము గర్భవతులు. ఈ దౌర్భాగ్యపురోజులలో వారి గర్భములనుండి పురుష శిశువులే జన్మింతురని యెట్లు చెప్పగలము. ఒకవేళ విధివిలాసమున రాజసింహాసనమునకు ఉత్తరాధికారి జన్మించినయెడల నాతఁడు వీరరాజపుత్రులగు మీసహాయమున కర్కశహృదయుఁడగు ఔరంగజేబు నధికారమునుండి మార్వాడు సింహాసనమును స్వాధీనము చేసికొనుననుట యసంభవ విషయముగాదు. నాయం దంతవఱకు ఎట్టి శ్రద్ధాభక్తులను కనఁబరచిరో నట్టివానినే రాజపుత్రుని యందుగూడ చూపవలయునని నా తుదియాజ్ఞ. సహోదరులారా! పరుల కష్టసమయములయందు అనూన సహాయము

లను చేసి వారి ప్రతిష్ఠను కాపాడిన మార్వాన్ రాజ్యము నేఁడు పరుల సహాయమునకు చేయి సాచవలసి వచ్చినది."

మహారాజు కన్నుల నశ్రులు చిందినవి. సర్దారులెల్లరు నతమస్తకులయిరి. మహారాజు సభవిడిచి లోపలికి పోయిన వెంటనే సర్దారులందరు తమతమ గుడారములకుఁ జేరిరి. తర వాత నొకవారము జరిగినపిమ్మట మహారాజు స్వర్గవాసి యయ్యెను. ఆతని రాణులందరును సహగమన మొనరించిరి. భాటీ దేవియు హాడీదేవియు సహగమనమునుండి నివారింపఁబడిరి. క్రీ. శ. 1678 సం॥లో మాఘబహుళ పంచమి మహారాజు స్వర్గవాసియయిన రోజు. ఫాల్గుణబహుళ చతుర్థినాడు భాటీ దేవి పుత్రునిఁగనెను. ఆమరునాడే హాడీదేవికికూడ కొడుకు పుట్టెను. పెద్దవానికి అచితసింహుఁడనియు రెండవవానికి దళ స్తంభన సింహుఁడనియు నామకరణములు చేయఁబడినవి.

ఔరంగజేబు ఈవార్తను విని రాణుల సిగువురను పెషా వరునుండి ఢిల్లీకి తీసికొనిరావలయునని యాజ్ఞాపించెను. మార్గ మధ్యమున శత్రుబాధను తాళజాలక రెండవపిల్లవాఁడు మరణిం చెను. మిగిలినవారు క్షేమముగ ఢిల్లీనగరమును చేరిరి.

మరునాడు దుర్గాదాసు మహారాణిరాకను తెలియ చేయుటకు పాదుషా ఔరంగజేబు నొద్దకేగెను. క్షేమసమాచ ములను ప్రశ్నించిన పిదప ఔరంగజేబు ఇట్లనియెను. "పాపము! దళస్తంభుఁడు స్వర్గస్థుఁడయినాఁడు. సక్రమముగు మార్గమున అజితసింహుని పెంచవలసిన బాధ్యత నామీదనున్నది. విశ్వాస

పాత్రుఁడగు యశోవంతసింహుని వంశాంకురము ఈ నలుసేకదా! ఈ బాలుని నాస్వాధీనమున నుంచుము! నే నీతని యభివృద్ధికి తగు నేర్పాటులను గావించెదను” కపటియగు ఔరంగజేబు యొక్క మనోభావమును గ్రహించి దుర్గాదాసు మృదుస్వర మున నిట్లనెను. ప్రభూ! అజితసింహుని వృద్ధి తమయధీనమున జరిగినటుల మఱియొకచోట జరుగదనుటలో సందేహమేమియు లేదు. తమకు అజితసింహునియందు ఇంతటి దయకల్గుట కాతని పూర్వజన్మ సుకృతమే కారణము. కాని యింకను అజితసిం హుడు పాలువిడునని మూఁడు మాసములపసికూన. తల్లి పాలు వదలి జీవించుట కష్టము. కనుక పాలువిడిచిన పిమ్మట తమ సంరక్షణలోనికి తీసికొనుట బాలుని యభివృద్ధికి ప్రథమసోపాన మని మనవిజేయుచున్నాను. దుర్గాదాసు మాటలను ఔరంగ జేబు ఆమోదించెను.

(పా దు షా)

మహారాజసమక్షమునుండి మరలివచ్చిన దుర్గాదాసు రాజపుత్రసేనాపతుల సమక్షమున తనకు ఔరంగజేబుతో జరిగిన సంభాషణను యథాతథముగ వర్ణించెను. ఇది విన్న తోడనే సేనాపతులు అగ్రహోదగ్రులయిరి. కాని దుర్గాదాసు వారి కోపమును నివారించుచు నిట్లనియెను. “ఇది యాగ్రహిం చుటకు సమయముగాదు. తంత్రము నవలంబించి కార్యమును సాధింపవలయును. మొదట నేదో యొకవిధముగ రాజకుమా రుని ఢిల్లీపట్టణమునుండి తప్పింపవలయును. మిగిలినదానిని

తరువాత నాలోచింపవచ్చును." రాజపుత్రసేనాపతులలో ఆనందదాసను నాతఁడు కడు నుపాయశాలి. మరునా డుదయమున నొక పాములవానిని పిలిపించి పాములబుట్టలో రాజపుత్రు నుంచి పరులకెరుకలేకుండ ఢిల్లీనగరమునుండి రాజపుత్రుని పంపివైచెను. అచటనుండి యాతఁడు దుర్గమములగు ఆబూపర్వతములమధ్యనుండి ప్రయాణించి మార్వాడు రాజ్యాంతర్గతమగు "డుగబా" యనుగ్రామమునుచేరి యచట తనమిత్రుఁడగు జయదేవుఁడను బ్రాహ్మణు నింటికేగెను. అచటనే రహస్యముగ రాజపుత్రుని పోషణప్రారంభమయ్యెను. ఢిల్లీలో నీరహస్యము బయలు కాకుండునట్లు వేరొక శిశువు మహారాణి యొడిలో నుంచఁబడెను.



## రెండవ ప్రకరణము.

క్రమముగ నొకవత్సరము గడచెను. అజితసింహుని ఫాదుషాకు సమర్పించు సూచనలేమియు కనుపించుటలేదు. అప్పుడు ఔరంగజేబు ఉగ్రుఁడయి "సక్రమముగ రాజకుమారుని సమర్పించని యెడల బలాత్కారముచేసి యైనను ఆతని గొనిరావలయునని నగర రక్షకభటాధికారియగు ఫౌలాదను వానిని పంపెను. ఆతఁడు 2000 ల రక్షకభటులను వెంటగొని మహారాణి నివసించిన భవనమును ముట్టడించెను. అకస్మాత్తుగ

సంభవించిన యాపదను గుర్తించి యిట్లనెను. పరప్రాణరక్షణకు ప్రసిద్ధిజెందిన రాజపుత్రులు ప్రాణములయందలి తీపిచే వెన్నుజూపుట నెఱుగరు. రాజపుత్రగౌరవముతో పెంచిన శిశువును మనచేతులతో మృత్యుముఖమున సమర్పింపఁజాలము" మహారాణి యిట్లనెను. "నన్ను గురించి విచారింపవలదు. నా మానమును కాపాడుటకు ఈ ఖడ్గముచాలును. రాజపుత్రులు మాతృదేశరక్షణకు తమప్రాణములనెట్లు సమర్పింతురో చూడవలయునను నాసచే జీవించియుంటినిగాని లేనిచో ఏనాఁడో చచ్చినవారిలో నన్ను లెక్కించుటకు వీలుకలిగి యుండెడిదనుచు ఖడ్గరాజమునకు తనహృదయమున నానందముతో స్థానమొసఁగి ప్రాణములను విడిచినది. రాజపుత్రులు మహారాణిని రక్షించుట యెట్లు? అను సమస్యనుండి ముక్తులయి యొరలనుండి తళతళ మెరయుచు శత్రురక్తమును జవిచూచుటకు త్వరపడుచున్న కరవాలముల కరములఁగొని శత్రుసైన్యముల నాక్రమించిరి. రూపసింహుడను సేనాని బాలుని రక్షణభారమును వహించి యుండెను. "హరహరమహాదేవ" యను ఘోషలు రాజపుత్రులను ఉత్సాహపూరితులను జేయుచున్నవి. సూర్య కాంతిలో తళతళ మెఱయు ఖడ్గకాంతులు కన్నుల మిఱుమిట్లు గొలుపుచున్నవి. సముద్రమువలె విశాలమగు మొగలుసేన లెక్కడ? అల్పసంఖ్యాపరిమితములగు రాజపుత్రసైన్యము లేడ? అపజయము స్థిరమని తెలిసియున్నను కేవలము ప్రాణ సమర్పణముకొఱకు యుద్ధముచేసిన రాజపుత్రవీర వీరులయొక్క

స్వామిభక్తి యెట్టిదియో యూహింపుము. భయంకరయుద్ధము జరిగినది. వెన్నిచ్చిన రాజపుత్రుఁడు కానరాడు. యుద్ధరంగమున రాజపుత్రులందఱు మరణించిరి. సాయంకాలమునకు యుద్ధము ముగిసినది. రక్షకభటాధికారి విజయోత్సాహముతో మహా రాణి విడిసిన భవనమును ఆమూలాగ్రముగ అన్వేషించెను. కాని రాజపుత్రునిజాడ తెలియలేదు. మహారాణి శవమును జూచి దిగ్భ్రమ చెందెను. పాపము! మహాసైన్యముతో వచ్చి రాజపుత్రులనందఱను వధించినను ఆతని యాప్సితమీడేరలేదు.

సంజచీకటు లలముకొనినవి. చల్లని మందమారుతము వీచుటచే క్షతగాత్రులు పరస్పర సహాయమున లేచుటకు ప్రయ త్నించుచున్నారు. సేనాపతి దుర్గాదాసు పరిస్థితి మిగిలిన వారం దఱికంటె కొంచెము బాగున్నది. ఆతఁడు తనవైపుపడిపోయిన రాజపుత్రుల నందఱను పరిశీలించి చూచి ఇంకను కొనప్రాణ ముతో నున్నవారికి చేయూత నొసంగి లేవఁదీసెను. 250 సం ఖ్యలో కొనయూపిరితో మిగిలినవారు దుర్గాదాసు, మోహక సింహుఁడు, భోజరాజు, రూపసింహుఁడు, మహాసింహుఁడు, దూధోసింహుఁడు మాత్రమే. వీరిలో వృద్ధుఁడగు దూధోసిం హుఁడిట్లనెను. "వెన్నెల తగ్గిపోవుచున్నది. అర్ధరాత్రి గడచి యుండును, ఇచట క్షేమకరముగాదు. శరీరమంతయు చితికి పోయినది. మిగిలిన ప్రాణములనయినను నిలుపుకొనుటకు ఇచటనుండి ఎంత శీఘ్రముగ పోయిన నంత మంచిది" దుర్గాదా సిట్లనియెను. "ఆగుము. మహారాణి శవమిచ్చట పడియుండగ

మనము ప్రాణములతో పారిపోవుటకు ప్రయత్నించుట యెంత సిగ్గుచేటు? మనము జీవించియుండగ మహారాణి పవిత్రశరీరము మ్లేచ్ఛులచేఁ జిక్కరాదు.”

ఆ వాక్యములలోని మాయ యేమోగాని పరుల చేయూతలేకుండ కదలుటకుగూడ అసమర్థులయినవారే ఆవేశ భరితులయి మహారాణిశవమును తెల్లవారు నప్పటికి ఢిల్లీ నుంచి 10 మైళ్ళదూరమునకు తీసికొనిపోయిరి. దుర్గమములగు ఆబూ పర్వత శ్రేణులయందు మహారాణి శరీరమునకు దహనక్రియలు జరిగినవి. రాత్రియంతయు నచటనే గడిచినది. మరునాడు జయదేవబ్రాహ్మణ గృహమునకుచేరి కుశలముగనున్న రాజ పుత్రునిఁజూచిరి. రాజపుత్ర దర్శనముచే గత దుఃఖములనన్నింటిని మరచిపోయిరి. మరునాడు రాజకుమారుని సంరక్షించుటకు ఆనందదాసు నియమించిరి. ఒకరియొద్ద మఱియొకరు సెలవుతీసికొని స్వగ్రామములకు వెడలిపోయిరి. దుర్గాదాసు రహస్యముగ కల్యాణగఢమునకు చేరెను. తల్లిని చూడఁగానే పరవశుఁడయి యామె పాదములకు ప్రణమిల్లినాడు తల్లి బిడ్డను హృదయమునకు హత్తుకొన్నది. మాతాపుత్రులకన్నులు బాష్పసిక్తములయినవి.

ఆసమయమునకు దుర్గాదాసు కొడుకు తేజకరణుఁడు సోదరుఁడు యశకరణుఁడును అచటికి వచ్చిరి. ఇరువురును రూపవంతులు; బలవంతులు. దుర్గాదాసునవలె దేశసేవకు స్వప్రాణముల నంకితమొనరించిన ధీరులు. వృద్ధమాత మొగలాయీల

దుష్కర్మకు బాధపడుచున్నది. దేశసేవలో ప్రాణములు పోగొట్టుకొనుటకంటె సుత్తమక్రియ లేదని కొడుకులకు చెప్పెను. ఇల్లు గట్టిచేసికొని పొరుగును చక్కబరచుము. బంధువులగు రాజపుత్రులే మొగలులకు సహాయము చేయుచుండగ పరుల ననవలసిన దేమియున్నదని ఆమె బాధ.

యశోవంతుని జ్యేష్ఠసోదరుఁడు అమరసింహుఁడు. ఆతని పుత్రుఁడగు ఇంద్రసింహుడు రాజ్యలోభమున చక్రవర్తి నాశ్రయించెను. పరాక్రమశాలురగు రాజపుత్రులు స్వమార్గమునకు కంటకప్రాయులనియు ఆకంటకములను పీకివైచి మార్వాడు రాజ్యమును స్వాధీనముచేసికొనవలయునని యాతని యాశ. తన మనసులోని యుద్దేశ్యమును ఔరంగజేబునకు తెలియజేసెను. ఔరంగజేబునకు ఆతని ఆశయము అర్థమయినది. తరువాత రాజ్యమిచ్చినను మానినను మొదట రాజపుత్ర యోధులను బంధించుట మంచిదని ఆతనికి తోచినది. రాజు తలచిన దెబ్బలకేమికొదువ? వెంటనే సైన్యములకు ఆజ్ఞాపత్రికలు చేరినవి. మార్వాడును పరిపాలించు మొగలాయీ సరదారునకు ప్రత్యేకముగ ఆజ్ఞలు చేరినవి. నాయకుల బంధించుట ప్రారంభమయినది. గ్రామదహనము లారంభమయినవి. అనేకులు చక్రవర్తిని శరణుజొచ్చిరి. మరికొందఱు యుద్ధము చేసి ప్రాణముల నర్పించిరి. కొందఱు అరణ్యములకు పారిపోయిరి. పారిపోయినవారి గృహములు కొల్లగొట్టఁబడినవి. స్త్రీల మర్యాద మంటగలిసిపోయినది. శిశుహత్యలు లెక్కకు

మీఁజినవి. రాజపుత్రవంశము మిగలదేమో? అను భీతి ఆవహించినది. శోనింగజీ చంపావతు పరిస్థితులను పరికించినాఁడు. యశోవంతుఁడు దాచుట కిచ్చిన ఇనుపపెట్టెను సంరక్షించుట యెట్లు? ప్రాణములు పోయినను పెట్టెమాత్రము శత్రుహస్తగతము కారాదు. ఈ యాలోచనలో నాతని హృదయ కోశమున వీరమూర్తి దుర్గాదాసు తటిల్లత యయినాఁడు. వెంటనే గుఱ్ఱము నెక్కినాఁడు. గుఱ్ఱమాతని యావేదన గ్రహించినట్లున్నది. మనోవేగమున ప్రయాణము సాగించినది. ఆరావళీ పర్వతప్రాంతములనున్న కల్యాణగఢమును చేరెను. దుర్గాదాసు శోనింగునకు స్వాగత మొసఁగెను. పరస్పర కుశలప్రశ్నలు పూర్తి యయినవి. దేశపరిస్థితిమీద చర్చజరుగుచుండగ శోనింగుఁడు ''చేతులు నలుపుకొనుచు కూర్చున్నందువలన లాభము లేదు. మాంద్యమును విడిచి నావెంట బయలుదేరుమని ప్రోత్సహించెను. దుర్గాదాసు మాతృపాదాభివందనముచేసి యామె యాశీర్బలముతో శోనింగుని వెంటఁ జనెను. సాయంకాలమగు నప్పటికి ఆవాగఢమునకు చేరిరి. ఆప్రాంతముల సంచరించు మొగలాయీలను జూచి దుర్గాదాసు సంశయగ్రస్తుఁడయ్యెను. దేశక్షేమమును కోరినయెడల ముందునకు నడువుమని శోనింగుఁడాతనిని హెచ్చరించెను.

ఇరువురును కోటలో నొక చీకటిగదిలో ప్రవేశించిరి. శోనింగుఁడు లోనుండి ఒక యినుపపెట్టెను గొనివచ్చి దుర్గాదాసు నెదుటనుంచి ఇట్లనియెను. ''మార్వాడునకు స్వాతంత్ర్య

మును సంపాదించి, యోధపుర సింహాసనము నెక్కిన వీరమూర్తి కిది బహుమానము. దీనియం దేమియున్నదని తెలిసికొనుటకు ప్రయత్నము చేయవద్దు. మహారాజు యశోవంతుఁడు మరణించుటకు 10 రోజులుముందు ఆజ్ఞాపించియున్నాఁడు. ఇంతవఱకు ఆతని యాజ్ఞానుసారము పెట్టెను ప్రాణపదముగ కాపాడియున్నాను. ఇఁక దీనిని కాపాడుటకు నేనసమర్థుఁడను. దీని భారమును నీపై నుంచుచున్నాను. నే ననుభవించిన కష్టములు నీకు రాకుండుగాక. ఒకవేళ దీనిని రక్షించుటకు సామర్థ్యము నీకు లేనియెడల నే చేసినట్లే నీవుగూడ మఱియొకరి యధీనము చేయుము.'' శ్రద్ధాళువగు దుర్గాదాసు హృదయమున నామాటలు నాటినవి. పెట్టెను నడుమునకు బిగించికట్టి శోనింగునియొద్ద సెలవుదీసికొని గుఱ్ఱము నెక్కి పరులకు గుర్తించుటకు వీలులేని మార్గమున బయలుదేరి పోయెను.

---

## మూఁడవ ప్రకరణము

దుర్గాదాసు మార్గము కంటకావృతము. చిమ్మచీకటి. నిమ్నోన్నతముల నశ్వపాదములు జాఱుచున్నవి. గుఱ్ఱము నడుచుటయే కష్టమయినది. చీమ చిటుక్కుమనిన చప్పుడగు నిశ్శబ్దత యావరించియున్నది. ఆకస్మికము కత్తులరాపిళ్ళు ఆతని దృష్టి నాకర్షించినవి. వీరమూర్తికి కత్తిచప్పుడు సివమెక్కించి

నది. ధ్వని వినవచ్చిన వైపునకు ఖడ్గహస్తుఁడయి పరుగిడినాఁడు. ఇరువురు రాజపుత్రులతో ఇటునడి యిద్దరు తురుష్కులు యుద్ధము చేయుట కంటఁబడినది. కోపముతో తురుష్కులఁ దాకెను. ప్రథమసంఘాతమునకే యిద్దరు బలియయిరి. తరవాత మరికొందరు నేలగూలిరి. జయాశతో పరవళ్ళుద్రొక్కు తురుష్కుల వెన్ను విఱిగినది పిడుగుఁ గూలినట్లు భావించి చెల్లాచెదరయిరి. సాహాయ్యముకొఱకు అంగలార్చిరి. కాలికి బుద్ధిచెప్పుటయే సాహాయ్యమయినది. దుర్గాదాసు రాజపుత్రులను పరిశీలించెను. ఒకఁడు మరణించెను. వేఱొకఁడు గాయపడెను. గాయపడిన రాజపుత్రుని భుజమున నిడుకొని పోదలఁచెను. కాని యది యశక్యమయినది. దూరమునుండి పరుగిడివచ్చు ఇరువదియైదుగురు తురుష్కభటులే యీ యశక్తతకు కారణము. తుఫాను విజృంభించినట్లు తురుష్కులమీద పడెను. పాపము! తురుష్కులకు తనమీదపడిన రాజపుత్రుని గుర్తించునంతలో దుర్గాదాసు పదిమందిని మట్టిపాలొనరించెను. జోరావరుఖాను హత్య చేయబడినాఁడని హాహాకారములు చెవినిబడినవి. తురుష్కులు వెనుకకు తగ్గుటగమనించి దుర్గాదాసు అట నిలచుట మంచిదికాదని యాలోచించెను. వెంటనే గాయపడిన రాజపుత్రుని ఎత్తుకొనెను. అశ్వము కల్యాణగఢమునకు ఎగిరిపోయెను. తెల్లవారుజామునకు గృహమునకు చేరెను. వృద్ధమాత రక్తస్నాతుఁడగు పుత్రుని, ఒడలెఱుగని రాజపుత్రునిఁ జూచి విహ్వలయయినది. వెంటనే యవసరమగు చికిత్స ముగిసినది.

కొంతసేపటికి దుర్గాదాసు స్వస్థుడయ్యెను. తల్లి విశేషములను పృచ్ఛించెను. దుర్గాదాసు ఇంటినుండి బయలుదేరి మరల చేరు వఱకు జరిగిన వృత్తాంతమును నివేదించెను. దెబ్బతిన్న రాజ పుత్రునిమీద నామె కన్నుపడినది. వెంటనే యామె యాతని గుర్తించి "ఈతని గుర్తించితివా?" యని దుర్గాదాసును ప్రశ్నించెను. దుర్గాదాసు సమాధానము నియ్యకుండగనే గాయపడిన రాజపుత్రుడు స్వస్థుడయి "అమ్మా దుర్గాదాసు నన్నెఱుగును? ఈపరిస్థితిలో గుర్తించలేడు. ఆయన నన్నుచూచి చాల కాలమయినది. అప్పటికిని ఇప్పటికిని నాలో వచ్చినమార్పు అమితము." అని పలుకుచు దుర్గాదాసుతో నిట్లనియెను. "వీర మూర్తీ! నేను మీవాదదాసుడనగు మహాసింహుడను." వృద్ధమాత మహాసింహుని తలనిముఱుచు "చాల చిక్కిపోయి నావు. నీకువచ్చిన కష్టమేమి?" అని ప్రశ్నించెను. మహాసింహుని నోటినుండి సమాధానము వచ్చునంతలో వృద్ధసేవకుడు నాథూరాముడు పరుగెత్తికొని వచ్చి "ఆయుధధారులగు మొగలాయీలు వచ్చి గ్రామమును ముట్టడించిరి. పారిపోవుట మంచిది" అని తెలియజేసెను.

ఈపరిస్థితిలోని బిడ్డలనుగని తల్లి "నాయనా! పారిపొమ్ము. నీవు ఒంటరివాడవు. శత్రువులు బహుసంఖ్యాకులు. పలువురితో నొకడు పోరుట పాడిగాదు. మహాసింహుడు గాయపడినాడు గదా? ఆతనిసహాయము నాకు దొరకును" అని పలికెను.

"వెనుకనున్న పాడునూతిలో దాగియుండుట మంచిది" అని వృద్ధసేవకుఁడు సలహానిచ్చెను.

తల్లిమాట మీఱుట దుర్గాదాసున కిష్టములేదు. దాఁగొనుటకు నూతినిచేరెను. మొదట దెబ్బతిన్న మహాసింహుని దింపెను. తరవాత శ్రీసింగుఇచ్చిన ఇనుపపెట్టెను, తరవాత యశఃకరణ తేజఃకరణులను లోనికిదింపెను. అప్పటికే తురుష్కులు ఇంటి నాక్రమించి గవాక్షములను ముక్కలుచేసిరి. దుర్గాదాసునకు నూతిలోదిగుటకు సమయము చిక్కలేదు. ఆ ప్రక్కనున్న మఱ్ఱిచెట్టునెక్కి కొమ్మలలో నక్కెను. అప్పటికి గృహద్వారములు బద్దలయినవి. దుర్గాదాసుకొఱకు కొంపం తయు గాలింపబడినది. కాని యాతనిజాడ తెలియలేదు. ఒక సైనికుఁడు వృద్ధమాతనుబట్టి నాయకుఁడగు మహమ్మదుఖాను నెదుట నిలిపెను. మహమ్మదుఖాను తురుష్కులలోఁ దప్ప పుట్టినవాఁడు. గంజాయివనములోని తులసిమొక్క. వీరమూర్తి మాతృశ్రీ ఒక సామాన్యయోధుని చేతఁబడుట ఆతని యాభిజాత్యమునకు గొడ్డలి పెట్టయినది. వృద్ధస్త్రీని విడువుడని సైనికుల కాజ్ఞనొసంగి యామెను సమీపించి యిట్లనియెను "అమ్మా! దుర్గాదాసు కంటాలియా గ్రామనాయకుడయిన శంషేరుఖానుని యన్నకొడుకగు జోరావరుఖానుని చంపివైచెను. చక్రవర్తి యాజ్ఞాప్రకారము కొఱతవేయుట యాయపరాధమునకు శిక్ష. అపరాధిని రక్షించువారికిఁ గూడ అదియే శిక్ష."

ఆతని మృదువచనములకు వృద్ధమాత తెప్పరిల్లి యిట్లనెను. "అయ్యా! నీవు మాట్లాడునది ఎవరితోనో యెరుగుదువా? నేను వీరమూర్తి దుర్గాదాసునకు తల్లిని. ఏ తల్లి యయినను తన బిడ్డను శూలారోపణ కల్పించగలదా? దుర్గాదాసు జాడ నాకు తెలియును. హత్యకు ప్రతీకారము హత్యయే యయిన దుర్గాదాసు అపరాధికాడు ఒకరాజపుత్రుని సంహరించినందులకు ప్రతిక్రియయే జోరావరుఖానుని హత్య. దానికి కర్త దుర్గాదాసు. ఆతఁడు దోషి యెట్లగును. నీవు వీరుఁడవు. వీరధర్మము నీకు తెలియును. నీచిత్తమువచ్చినట్లు చేయుము.

అమ్మా! ఈసంగతి నేనెఱుగను. దుర్గాదాసు నిర్దోషియే. నాకు సెలవిమ్ము. కాని ఒకమాట. సూర్యోదయమునకు లోపుననే దుర్గాదాసును సురక్షితమగు రహస్యస్థానమునకు పంపివేయుము. ఇతర సరదారులువచ్చి యన్వేషింతురు. అప్పుడు దుర్గాదాసు ప్రాణములు దక్కవని పలికి సజ్జనుఁడగు మహమ్మదుఖాను తనసైన్యమునకు మరియొక గ్రామమును వెదకుట కనుజ్ఞనొసంగి వెడలిపోయెను. అనుకొనని సహాయము అప్పుడప్పుడు లభ్యమగుట విధివిలాసము మాత్రమే.

సైన్యముల సద్దు యణగిపోయినది. చెట్టుదిగి దుర్గాదాసు తల్లిని సమీపించెను. ఆమె మహమ్మదుఖానుని సత్స్వభావమును పొగడుచు సూర్యోదయమగుటకు పూర్వమే రహస్యస్థలమునకు తరలిపోవలయునని పుత్రుని యాదేశించెను. దుర్గాదాసు దానికి అంగీకరించుట కష్టమయినది. యశఃకరణ తేజ

కరణులను మాత్రరక్షణార్థ మచటనే యుంచవలయు నను కొనెను తల్లి దానికి ఒప్పుకొనలేదు తన రక్షణకు ఆ వృద్ధసేవ కుడు చాలు ననెను. యశఃకరణ తేజఃకరణులు దుర్గాదాసుతో నున్న యెడల నాతని సహాయమునకు వారుపయోగపడుదురని యామె యుద్దేశ్యము.ఒకరికిద్దరుండుట మంచిది కాదా? ఎప్పుడేమి యవసరము వచ్చునో! సూర్యోదయమునకు ముందుగనే దుర్గా దాసు పుత్రుని సోదరుని వెంట నిడుకొని బయలుదేరెను. బయలుదేరునప్పుడు వృద్ధసేవకుని పిలిచి యిట్లు చెప్పెను. తల్లి యొక్క యోగక్షేమములను ప్రతిదినము తెలియచేయుము. దుష్కులు ధూర్తులు జాగరూకుడవయి యుండుము. మహా సింహుడు జీవించియున్న యెడల ఉన్న వానిని ఉన్నటులనే వెంటనే మాడో సంస్థానమునకు పంపివేయుము. మరణించిన యథా శాస్త్రీయముగ దహనకర్మ పూర్తిచేయుము. ఇనుపపెట్టెను గుండెలలో నుంచుకొని కాపాడుము. దానిలో నేమున్నదని తెరచి చూడవద్దు!.

సేవకునకు హితోపదేశ మొనరించి ఆరావళీ పర్వత గహనారణ్యముల లీనమయి పోయెను పాపము! ఆ వృద్ధమాత చాలసేపటివఱకు కొడుకు వెడలిన దారినే పరిశీలించుచు నిలిచి నది. పుత్రులు మనుమడు కంటికి కగుపించకపోవుటతోనే యామె నేత్రములు బాష్పస్విన్నములయినవి. పుత్రుల యోగ క్షేమములకొఱకు భగవంతుని ప్రార్థించినది.

వృద్ధసేవకుఁడు ఇంతవఱకును బయటనే నిలచియున్నాఁడు. తాత్తరగ లోనికి పరుగెత్తుకొనివచ్చి "అమ్మా! శత్రువులు చ్చుచున్నారు" అని చెప్పునంతలోనే రెండువందలమంది తులువచ్చి యా గృహమును ముట్టడించిరి. ఒకఁడు లోనికి చొచ్చుకొనివచ్చి యావృద్ధురాలి జబ్బ పట్టుకొనెను. ఈ దృశ్యము వృద్ధసేవకుని వేధించినది. వృద్ధమాతకొఱకే యావిచా రము. తనకయి యాతఁడు పరితాప పడినదే లేదు. ఒకక్షత్రియ రుష్కులమధ్య బద్ధయయి నిలచుట నాతఁడు చూడలేక యెను. కాని యాతఁ డేమిచేయగలఁడు? నలుగురు సైనికు తనిని ఇంతకుముందే బంధించివైచిరి. నాయకుఁడా వృద్ధను చూపించి "అపరాధి దుర్గాదాసెక్కడ" అని గర్జించెను.

"నాకు తెలియదు. ద్వారములు తెఱవఁబడియే న్నవి. వెదకికొనుఁడు" అని యామె సమాధాన మిచ్చెను.

సరదారు "గర్జింపుల కామె తొణకదు" అని నిశ్చ ంచుకొనెను. మంచిమాటలతో నామెను వశపఱచుకొన చి యిట్లనెను. "అమ్మా! నిజమాడుము. దుర్గాదాసుచేసిన పరాధము క్షమింపఁబడును. నాకు వీలయినంతవఱ కాతనికి హాయముచేయుదును. చక్రవర్తిగారికి చెప్పి నీకు కావలసిన మిప్పించెదను. నిజమునకు అపరాధి దుర్గాదాసు కాఁడు. రాజపుత్రుని నిమిత్తము జోరావరుఖాను సంహరింపబడెనో ఆరాజపుత్రుఁడే యపరాధి. ఆ రాజపుత్రుఁ డెవఁడు? ఎచట న్నాఁడు? దుర్గాదాసు ఏమయినాఁడు? ఈ సమాచారమును

చ క్రవర్తికి తెలుపుటకు నీవిష్టపడని యెడల వారికి బదులుగ నీకు మరణశిక్ష విధింపబడును.”

“మంచిది. అట్లే కానిమ్ము. బిడ్డలకొఱకు ప్రాణము విడుచుట నాకు చాల సంతోషము. నాకా వయసు చెల్లినది. మరణకాలము సమీపించినది. దుర్గాదాసు క్షమింపబడు నంత మాత్రమున నేను విశ్వాసఘాతుకత్వమును చేయఁజాలను. శరణుఁజొచ్చిన వానిని స్వార్థవశమున నీకప్పచెప్పజాలను.” అని ధైర్యముతో నావృద్ధమాత సమాధాన మిచ్చెను.

సమాధానము వినునప్పటికి షంషీరుఖానుని మొత్తదన మంతయు మాయమయినది. ఆమెను చంపివేయుటకు కత్తి నెత్తెను. ఎచటినుండి వచ్చినదో యీ వృద్ధసేవకునకు ఆశక్తి? సైనికులనొక్క పర్యాయము విదలించి వృద్ధమాతకు కవచ మయి నిలచెను. షంషీరుఖానుని ఖడ్గఘాతమునకు ఆవృద్ధుఁడు నేలఁగూలి తన కర్తవ్యము నెఱవేర్చెను. రాజపుత్రస్త్రీ వంశ మర్యాదను నిలుపుటకు నవ్వుచు తన ప్రాణములను బలియొసఁగినది. అయినను షంషీరుఖానునకు తృప్తికలుగలేదు. ఇంట నున్న వస్తువుల నన్నిఁటిని దోచివైచెను. సైనికులందఱును వెడలిపోవుట కాజ్ఞాపించెను. అందఱును వెడలిపోయిరి, గాని ఒక్కఁడు మాత్రమింకను అచటనే నిలచియుండెను. ఈదౌర్జన్య మాతని హృదయమును కలచివైచినది. నిరపరాధియగు నొక వృద్ధమాత, ఆమెను సంరక్షించుట కొకవృద్ధుఁడు ప్రాణముల నర్పించుట; అనునవి యీతని ధర్మబుద్ధిని రెచ్చగొట్టినవి.

షంషీరుఖాను ఆతనివైపు దిరిగి "ఏల నీవింకను నిలిచితివి" అని ప్రశ్నించెను. ఆతని నామము ఖుదాబక్షుఖాను. ఆతఁ డిట్లని యెను. "నీవంటి నీచుల యాజ్ఞను నేను తలఁదాల్పను నీవు సిస లయిన తురుష్కబీజమునకు జన్మించిన వాడవుగావు ధర్మబద్ధు డగు తురుష్కుఁ డెన్నఁడు నిట్టి నీచకార్యముల నొనరింపడు.వీరుఁ డయిన వాఁడెన్నడును స్త్రీలపయి చేయిచేసికొనఁడు. నీవు వృద్ధస్త్రీని హత్యచేసితివి. ఈమె నీకు చేసిన యపకారమేమి? దుర్గాదాసు చేసిన యపరాధముకంటె నీవు చేసిన యపరాధము గొప్పది."

షంషీరుఖాను ఈ పరుషవాక్యములను వినఁజాలపోక యెను. వెంటనే కత్తితో నాతనిమీదకు ఉఱికెను. అంతకు పూర్వమే యాసైనికుడు సర్వసిద్ధముగ నుండెను. దెబ్బతప్పించుకొని యాతని క్రిందఁబడవైచి రొమ్మునెక్కి పొడిచివేయుటకు కత్తినెత్తెను. షంషీరుఖానుగారి కన్నులు పచ్చఁబడినవి. ప్రాణములమీద నాశ సన్నగిల్లినది. సహాయము చేయువారెవ్వరును లేరయిరి. సైనికులందఱును అంతకుముందే వెడలిపోయిరి. షంషీరుఖాను చేయునదిలేక ఖుదాబక్షుఖానుని పాదములబట్టి ప్రాణరక్షణను వేడెను. ఖుదాబక్షుఖాను కత్తి మొలలోనుంచుచు "మూర్ఖుఁడా! నిన్ను దయతలచరాదు. దయదలచి నిన్ను వదలివేయుచున్నానని యనుకొనకుము. నిన్ను నేను చంపిన యెడల దుర్గాదాసు తన మాతృహత్యకు ఎవరిమీద పగతీర్చుకొనును ఆతని క్రోధాగ్నికింధన మగుటకే నిన్ను వదలివేయు

చున్నాను నీవంటి నక్కను సంహారించి నాఖడ్గమును మలినము గావింపను." అనిపలికి తనదారిని వెడలిపోయెను. పాపము! సామాన్యసైనికుని చేతిలో పరాభవమునంది షంషీరుఖాను కంటాలియా గ్రామమునకు చేరెను.

ఖుదాబక్షుఖాను వృద్ధస్త్రీని పరిశీలించెను. ఆమె ప్రాణములు పోయినవి. వృద్ధసేవకుడింకను శ్వాసించుచున్నాఁడు. తగిలినగాయము గాటమయినది. కొంతసేపటికి ఆతనిలో చైతన్యము పొడసూపినది.

వృద్ధసేవకుని చైతన్యముజూచిన ఖానుమనస్సున వెన్నెలలు విరిసినవి. వెంటనే గాయమునుకడిగి కట్టుగట్టెను. తన్నుంజూచి సంశయించుచున్న వృద్ధసేవకునిజూచి ఖాను ఇట్లనియెను. "నన్నుజూచి బెదరకుము. ముసల్మానులందఱును ఒకేవిధముగ నుండరు. పాపాత్ములు ఒకనాఁడు తమపాపమునకు భగవంతుని యెదుట సమాధానము నీయవలసియున్నది. నన్ను నమ్ముము. నీసోదరునిగ భావించి నావలన కాదగు పనిగొనుము."

వృద్ధసేవకుఁడీ యకారణ బంధులాభమునకు విధివిలాసము కారణమని తలఁచి మనమున సంతసించెను. ఇరువురును గలసి వృద్ధమాత శవమును ఒకగదియందుంచి మహాసింహుని నూతినుండి వెలుపలికి తీసెను. నూతిలో స్పృహతప్పియున్న మహాసింహుఁడు బయట శీతలస్వచ్ఛ వాయుప్రసారమున చైతన్యవంతుఁడయ్యెను వృద్ధసేవకుఁడు దుర్గాదాసు ప్రస్థానమును, తురుష్కుల దాడివలన వృద్ధమాతృ మరణమును మహాసిం

హుసను వినిపించెను. ఆతనికన్ను లశ్రుపూర్ణము లయినవి. నిర్భాగ్యుఁడగు తనమూలముననే ఇట్టికష్టములు సంప్రాప్తించినవి. తానాయటవిలో మరణించియున్న నీదుష్కృత్యము జరిగి యుండకపోవునని వాపోయెను.

ఆతని నోదార్చుచు వృద్ధసేవకుఁ డిట్లనియెను. జరిగిన దానికి విచారింపకుడు. ఖుదాబక్షు సహాయమున మీరు వెంటనే మాడోసంస్థానమునకు వెడలిపొండు. నేను దుర్గాదాసువద్దకు వెళ్ళెదను.”

నాకు వేరొకరకపు వస్త్రములు గావలయును. ఈ వేషమునన్న నన్ను ఇతరులు గుర్తింపగలరు. వేషముమార్చుట మంచిది అని ఖుదాబక్షు వచించెను.

వృద్ధసేవకుఁడు రెండు గుఱ్ఱములను ఒక జతబట్టలను దెచ్చియిచ్చెను. మహాసింహుఁడు తనవెంట నినుపపెట్టెనుగొని మాడోసంస్థానమునకు బయలుదేరి వెళ్ళెను. సేవకుఁడు దుర్గాదాసును వెదకుచు ఆరావళీ పర్వతసానువుల సంచరింపసాగెను. వయసు మళ్ళినది. గాటమగు గాయము తగిలినది. పర్వతారోహణము క్లిష్టమయినది. ఈకారణములచే నాసేవకుఁ డలసిపోయి ఒకచోఁగూర్చుండి యిట్లు చింతింపసాగెను. “అయ్యో! భగవంతుఁడా! రెండురోజులలో నెన్ని విపర్యయములు జరిగిపోయినవి. రెండురోజులకు ముందు కలకలలాడు రాజభవనము శ్మశానమయిపోయినది. రాజపుత్రస్థానమున పేరుమోసిన మహావీరుఁడు పర్వతదుర్గములఁ దలదాచుకొన్నాఁడు. ఆతని వృద్ధ

మాతశవము దిక్కు లేక కుళ్ళిపోవుచున్నది. జెట్టిలగు తనయు లుండ ఆవీరమాత గతి యిట్లయినది.

యీ యాలోచనలో నాతని చైతన్యము నిస్తేజమయి నది. దుఃఖాత్ములకు శాంతినిచ్చు నిద్రాదేవికాతఁడు ప్రియుఁ డయినాఁడు. చల్లని పిల్ల వాయువులు జోలపాడి యాతని జో కొట్టినవి. సూర్యోదయమున కాతఁడు మరల చైతన్యవంతుఁ డయినాఁడు. భగవన్నామస్మరణ చేయుచు రెండుజాము లగు నప్పటికి దుర్గాదాసు నివసించిన పర్వతము జేరెను. తన యాగ మనమును దుర్గాదాసునకు తెలుపుటకు రాజపుత్ర జాతీయగీత ము నుచ్చైస్స్వరమున పాడెను. దుర్గాదాసు దానిని గుర్తించి వ్వస్థానమునుండి బయలుదేరి వచ్చి యాతనిగుర్తించెను. దుర్గా దాసును జూడఁగానే సేవకుఁడాతని పాదములపై వ్రాలెను. దుర్గా దాసు మాతృక్షేమమును పృచ్ఛించెను.

ఆ ప్రశ్నకు సమాధానము సేవకునికడ నేమికలదు? మాట మార్చవలయునను నుద్దేశముతో "మహారాజా! నిన్న మీరు బయలుదేరుటయే తడవు మహాసింహుని పాతాళము నుండి వెలికితీసితిని. ఆయనప్రాణములు నిలిచియున్నవి. ఇనుప పెట్టెతో మాడోసంస్థానమును చేరెను. పోవునప్పు డీ యుంగ రమునిచ్చి "ఈయుంగరమును ప్రభువుకిమ్ము. పనివచ్చినప్పుడీ యుంగరముతోఁ బాటు మనుజుని పంపినయెడల నాప్రాణముల నర్పించియైనను కార్యము నెరవేర్చెదనని చెప్పియున్నాఁడు. ఆతనిపంపివైచి నేను మీదర్శనముకొఱకు వచ్చియున్నానని

చెప్పెను. ఎంతసేపు చెప్పినను మాతృక్షేమము నాతఁడు తెలియఁ జేయలేదు దీనియాంతర్యమును గ్రహించినాఁడు. యశఃకరణుడు "ముందు తల్లి క్షేమమును చెప్పుము. ఇతర విషయములను తెలుపుట కింకను సమయము గలదు" అని నిలువఁదీసెను. పాపమా సేవకుని కంఠము గద్గదికమయినది. కన్నులశ్రుపూరితము లయినవి. నోటనుండి మాట వెలువడలేదు. ఆతని వాలకము దుర్గాదాసు హృదయము గలచివైచినది ఈనైశ్చబ్యము దుర్వార్తకు నాంది యని యాతడు గుర్తించినాఁడు. "ఏల పలుకవు ఏమి జరిగినది" అని తరచి యడిగెను. సమాధానము మొదట రోదనము. దాని యంతరాంతరముల దుఃఖవార్త విశదమయినది. చిహ్నముగ మాతృహృదయ విస్ఫోరకమగు షంషీఖాను ని ఖడ్గము ప్రదర్శితమయినది.

దుర్గాదాసు నేత్రములు కెంపెక్కినవి. తురుష్క ఖడ్గమును చేతపట్టి ప్రతిజ్ఞ యొనరించినాఁడు. "ఈశ్వరా! ఏ పాపాత్ముఁడు నిర్దయుఁడయి నిరపరాధ యగు మాతృదేవతను హత్య జేసెనో ఆ పాపాత్ముని ఈఖడ్గముతో చీల్చివేయు నంతవఱకు నీరు ముట్టను" అని శపథ మొనర్చెను ఈప్రతిజ్ఞ సేవకుని హృదయమునకు వేదనాకరమయ్యెను. "స్వామీ నీవు ఏకాకివి. తురుష్కులనేకులు, ఒకవేళ అనతికాలమున నీశపథము పూర్తికాని యెడల ఎంతవఱకు అన్నపానముల విసర్జించి యుండఁగలవు?" అని హెచ్చరించెను.

"పోరాడుచున్నావు. నే నేకాకినికాదు. సత్యధర్మములు నా తోడునీడలు. సత్యమునకు విజయము తథ్యము. ఆమెదానిపైఁ జేయిచేసికొనినవాఁడు కలకాలము మనఁజాలఁడు. భగవంతుఁ డనుగ్రహించిన నేఁడే మాతృప్రాణవిముక్తుఁడను కాగలను. నేను నాకర్తవ్యమును విస్మరించిన యెడల దేశసేవకొఱకు ప్రాణముల నర్పించిన క్షత్రియాణి పుణ్యలోకముల నందజాలదు. ఇది పుత్రధర్మము" అని తనదృఢ నిశ్చయమును తెలిపెను.

సూర్యాస్తమయమయినది. చీకటి మించినది. దుర్గాదాసు సేవకునికి ఉంగరమునిచ్చి "మహాసింహుని దగ్గరకు పొమ్ము. దుర్గాదాసు మాతృహత్యా ప్రతీకారమునకు కంటాలియా గ్రామమునకు వెళ్ళెను. జీవించియున్న మరల కలసికొనును. లేనియెడల ఇవియే తుదిమాటలు" అని చెప్పుమని యతనిని పంపివైచెను. తక్షణమే పుత్రసహోదరుల వెంట నిడుకొని కంటాలియా గ్రామమునకు బయలుదేరెను. ఒకజాము రాత్రి నడుచునప్పటికి పటేలు గ్రామము చేరెను. అచటి నాయకుడు రణసింహుఁడు. నూర్గురు రాజపుత్రులతో నెదురేగి దుర్గాదాసునకు స్వాగతమిచ్చెను. రాజపుత్రులను జూచుటతోడనే దుర్గాదాసు మనము చల్లఁబడినది. పంచీముఖానుని ఖడ్గమును పైకెత్తి "సోదరులారా! ఇది క్రూరాత్ముఁడగు పంచీముఖానుని ఖడ్గము. అతడే కంటాలియా గ్రామమునకు నాయకుఁడు. నిరపరాధయగు వృద్ధమాతను ఘోరముగ హత్యచేసి రాజపుత్రజాతి నవమానించినాఁడు. హత్యాప్రతీకారమునకు ప్రతిజ్ఞ చేసి

తిని. రాజపుత్రుల మను నభిమానము, దేశసముద్ధరణయందు ఆశయము, నిరపరాధమానవతీ సంరక్షణయందు శ్రద్ధ మీలో నున్న యెడల శత్రుప్రతీకారమునకు ప్రతిన నైకొనుడు" అని యెలుగెత్తి చాటెను.

అగ్నిగోళముల వంటి యీ మాటలు రాజపుత్రుల రక్తమును ఉడుకెత్తించినవి. రాజపుత్రులు ముక్తకంఠముతో "ప్రతీకారము చేసితీరెదము. కంఠములో ప్రాణములున్నంతవఱకు మీయాజ్ఞను పాలించెదము" అని ప్రతిజ్ఞ చేసి ఒఱలనీసిన కత్తులంగేలం గైకొని దుర్గాదాసు ననుసరించిరి.

అప్పటి కర్ధరాత్రము మీఱినది. ప్రాణపణముల నొడ్డిన సేనలు కంటూలివరా గ్రామమును జేరి కోటను ముట్టడించినవి ద్వారము బ్రద్దలయినవి. సైన్యములు లోనఁజొచ్చినవి. ఎదుటఁ బడిన ప్రతివాఁడును ధరణీతలాలింగితుఁడు కావలసినదే. కత్తుల గాటపు సవ్వడులకు మహీసుభాను ఉలికిపడినాఁడు. కన్నులు తెఱచునప్పటికి ఎదుట వీరమూర్తి దుర్గాదాసు ప్రత్యక్షమయి నాఁడు. మూర్తీభవించిన మృత్యుదేవతను జూచినట్లు గజగజ లాడిపోయినాఁడు. దుర్గాదాసు "ఆడువారిని చెఱపట్టు నీచుఁడా లెమ్ము! యుద్ధమునకు సిద్ధముగమ్ము. నిద్రాణరిపులపై రాజపుత్రులు కత్తినెత్తరు. ఇదిగో! చూడుము. ముదుసలి తల్లి రక్తమును పానముచేసిన ఖడ్గమిదే. దీని దాహమింకను దీరలేదు. నీకొఱకెదురు చూచుచున్నది" అని హెచ్చరించెను.

షంషీఖఖానునకు పూర్తిగ మెలకువ వచ్చినది. యుద్ధమునకు సిద్ధుఁడయి దుర్గాదాసుతోఁ దలపడెను. తొలిదెబ్బకే షంషీఖఖానుని శిరము తాటిపండువలె నేల రాలినది. దుర్గాదాసు ఖడ్గమును అచటనే విసరివైచెను. తన యనుయాయులను వెంటనిడుకొని ఆరావళీపర్వతములకు మరలిపోయెను.

---

## నాలుగవ ప్రకరణము

దుర్గాదాసు దగ్గఱ సెలవుతీసికొని సేవకుఁడు మఱునాఁడు మాళ్వాసంస్థానమును చేరెను. వచ్చినవాఁడు వీరమూర్తి దుర్గాదాసు సేవకుఁడని తెలియుట తోడనే ద్వారపాలకుఁ డాతని మహాసింహునొద్దకుఁ గొనిపోయెను. మహాసింహుఁడు నాథూ సేవకుని నాదరించి దుర్గాదాసు సందేశమును శ్రద్ధాభక్తులతో నాలకించెను. హృదయము ఆలోచనాతరంగముల నుయ్యేలలూఁగెను తుదకు ఒకనిశ్చయమునకు వచ్చి సేవకునితో "నాథూ! నన్నుగూర్చికదా తురుష్కులతోడి వైరము దుర్గాదాసునకు కలిగినది. దుర్గాదాసు దేశస్వాతంత్ర్యముకొఱకు అడవులఁబట్టి తిరుగుచుండ నేను రాజ్యభోగముల ననుభవించుట సిగ్గుచేటు. ప్రాణదాతకు ప్రత్యుపకారమొనర్పని జన్మ వ్యర్థము. రేపు నీవెంట నేనుగూడ వచ్చెదను అని పలికెను.

తేజోబాయి మహాసింహుని భార్య. భర్తృవాక్యములను సంపూర్ణముగ నాలకించి "మహారాజా! దుర్గాదాసు విష

యము తలపెట్టకుడు. ఆతని ననుసరించిన సర్వనాశముతప్పదు. మీకాయముల గాయములవచ్చి యింకను ఆరలేదు. వెంటనే మొగలాయీలతోడి యుద్ధమునకు సిద్ధమగుట బుద్ధిహీనతయే. రాజపుత్రులసంఖ్య పరిమితము. విశాలధరణీతలాధిపతియగు చక్రవర్తి సైన్యముల నెదిర్చి యోడించుట కలలోనివార్త. మీసంరంభము దీపకాంతి మీదికెగిరిపడిన శలభములగతి యగును. చక్రవర్తితో శత్రుత్వము దెచ్చికొని దుర్గాదాసు బాముకొనినదేమిటి? నోటిదగ్గఱికూడు జెడగొట్టుకొనినాఁడు. జోరావరుఖాను ని చంపి పొందిన సుఖమేమిటి? తల్లిహత్యచేయ బడినది. నిలువనీడలేదు పర్వతారణ్యములేగతియయినవి. గర్వి యగు దుర్గాదాసు పక్షమునచేరి రాజ్యనాశనముచేయుటకు మీమనసెట్లొప్పుచున్నది?'' అని మందలించెను. ఈ మాట లాతని హృదయమునకు బాణప్రాయములయినవి. "ఇంటగెలిచి రచ్చగెలువవలయునుగదా? క్రోధమును పైకి రానీయక'' తేజో! నీపుత్రిక మానమును సౌభాగ్యమును రక్షించిన దుర్గా దాసును గర్వియనుటకు నీకుసిగ్గులేదా? దుర్గాదాసు ముసల్మాను లకు వైరియగుటకు కారణముస్వార్థముగాదు; నేను నా మూల మున నాతఁడు చక్రవర్తికి శత్రువయినాఁడు. ఆతఁడు జోరా వరుఖానుని వధింపకున్న నీ కూఁతురుగతి యేమి యయ్యెడిదో? ఏఱుదాటి తెప్పతగులబెట్టినట్లు ఆతనివలన పనిగొని మూర్ఖుడని నిందించుచున్నావా? నీవంటి నీచురాలిని క్షత్రియవంశమునందు సృష్టించినందులకు బ్రహ్మ నన వలయును'' అని యాక్షేపించెను.

తేజో బాయికి రాజభోగములయందలి యాశ మెండు. మహాసింహుని యుపదేశ మామె చెవికెక్కలేదు. అచటినుండి కదలిపోయినది. మహాసింహుని యన్నకొడుకగు మానసింహుని యెద్దకు చేరి నాయనా! కొంచెము మీపినతండ్రికి నచ్చఁ జెప్పుము. తినికూర్చుని చేతులార ఈ కయ్యమునకు కాలు ద్రువ్వుట యేల? చేతులు కాలినతరువాత ఆకులు పట్టుకొనిన ప్రయోజనమేమియు నుండదు. దీనిలో మనకు కలుగఁబోవు మేలులేదు" అని యుపదేశించెను. మానసింహుఁడా, తక్కువ తిన్నది. "పిన్నీ! ఇది పసుల విషయముగాదు. మన స్వవిషయ మనుసంగతి మఱచిపోకుము. మన వంశగౌరవమును రక్షించు టకే దుర్గాదాసు చక్రవర్తికి శత్రువయినాఁడు. దీనియందు దుర్గాదాసునకుగల స్వార్థమేమిటి? దీనజనోద్ధరణ రాజపుత్రుల కర్తవ్యము. పైఁగా దుర్గాదాసు మనలను గుఱించి కష్టముల పాలయినాఁడు. ఆయనకు సహాయము చేయని యెడల రాజ పుత్రజాతికే యవమానముచేసి నట్లగును. మా పినతండ్రి వెళ్ళుట నీకిష్టము లేనిచో నేను తప్పక వెళ్లెదను" అని చెప్పెను.

మానసింహుఁడు పినతల్లి దగ్గఱనుండి బయలుదేరి పిన తండ్రి దగ్గఱకువచ్చి "బాబయ్యా ఇంకను మీగాయములు పచ్చిగనున్నవి. దుర్గాదాసు సహాయమునకు నన్ను మీసైన్య మునకు నాయకునిగఁజేసి పంపుడు. మీరు చేయవలసిన కార్య మును నేను నిర్వహించెదను" అని పలికెను. మానసింహుని

సాహసమాతనికి ఆనందమును కలిగించినది. వెంటనే మూఁడు వందల రాజపుత్రు కతనిని నాయకునిగ నొసరించెను. మాన సింహుఁడా సైనికుల యెదుట నిలిచి "సోదరులారా! చిప్పుడు రుకుటకు సిద్ధముగనుండుడు. ఈ సాహసకార్యమున ప్రాణముల నర్పించుటకు సిద్ధముగ నున్నవారే నాతో రావలయును. దారా పుత్రవ్యామోహము వెనుకకు లాగినయెడల రావలదు. ప్రాణములఁతీపి గలవారు మిగిలిపొండు. యుద్ధక్షేత్రమున శత్రు పరాక్రమమునకు వెన్నిచ్చి రాజపుత్రప్రతిష్ఠకు కళంకము తేసి కొని రాకుడు" అని యుపన్యసించెను. అతని యుపన్యాసము నకు వీరరాజపుత్రు లావేశభరితులయి యిట్లనిరి. "మాతృ దేశము స్వతంత్రమగునంతవఱకు ముందడినయడుగు వెనుకకు రాదు. మరణించిన వీరస్వర్గము జీవించిన యశోభాగ్యములం ఏమయినను మంచిదే''.

వీరుల యుత్సాహమునుజూచి మానసింహుఁడు తృప్తి నందెను. సైన్యమును మూఁడు భాగములుగ నొనరించెను. ఒక్కొక్క దానియందు నూర్గురుండిరి. ఒకభాగమునకు నాయ కుఁడు రూపసింహుఁడు. మఱియొక భాగమునకు అధిపతి మో హకసింహుఁడు. వేరొకభాగమునకు సంచాలకుఁడు మానసిం హుఁడు. ముగ్గురునాయకులు వేర్వేఱు మార్గముల పయన మగుటకు నిశ్చయించిరి. రాజపుత్రు లందఱును ఏకమార్గము ననే పయనించిన తురుష్కుల యనుమానమునకు తావిచ్చిన ట్లగును. వెంటనే యుద్ధమారంభమగును. రాజపుత్రులు యుద్ధ

మునకు వెనుదీయువారు కారు. కాని వారనుకొనిన కార్యక్రమ మునకు విఘ్నము కలుగును. దుర్గాదాసునకు సహాయము చేయుట కల్లయగుటయేకాక ఆత్మరక్షణయే దుర్ఘటమగును. దీనినంతను ఆలోచించియే మానసింహుఁడీ యుపాయమును పన్నినాడు. నాయకుల నిరువురను సైన్యములతో అనుకొనిన ప్రకారము పంపివైచెను. మానసింహుఁడు తనసైన్యమును బయటనిలిపి లోనికిఁబోయెను.

"తానొకటి తలచిన దైవమొకటి తలచును." మానసిం హుఁడు లోనికేగి లాలబాదగ్గఱ, తేజోబాయిదగ్గఱ సెలవుదీసి కొని బయటికివచ్చి బయలుదేరబోవు చుండెను. హఠాత్తుగ దక్షిణదిక్కున ఖురపుటాహతికి రేగిన పరాగము కాలమేఘము వలె కనుపించినది. ముసల్మానులు వచ్చుట దృష్టిగోచరమయి నది. ఈవార్త నందజేయుటకు మానసింహుఁడు లోనికిఁబోయి నాఁడు. ఇంతలో సైన్యములువచ్చి మీఁదఁబడినవి. ఇదివరకే యుద్ధమునకు సిద్ధముగ నిలిచియున్న రాజపుత్రులు యుద్ధము నకుఁ దలబడిరి. భయంకరయుద్ధము ప్రారంభమయినది. పరిస్థి తులు విషమించుట మహాసింహుఁడు గ్రహించి మానసింహుని చేరఁజేరి యిట్లనియె. "నాయనా! వెంటనే లాలబీను ఎట్లయి నను ఇచటినుండి తప్పించుము. వంశప్రతిష్ఠ కళంకితమగునని భయపడుచున్నాను గాని మరణించుటకు భయపడుటలేదు" అని పలికెను. మానసింహుఁడు వెంటనే లాలబీదగ్గరకు వచ్చి యామెకు పరిస్థితులను తెలియఁజెప్పి సారంగపు మొగమునకు

తీసికొనివచ్చెను. లాలబీ తాను బయలుదేరుటకు ముందు వృద్ధుఁడగు నాధూను రక్షింపవలయునని కోరెను. మానసింహుఁ డామె మాటను కాదనలేక "అమ్మా నేను నాథూను తీసికొని వచ్చుటకు వెళ్ళెదను. నేవచ్చుటలో నాలస్యము జరిగినయెడల నీవీ సొరంగము ననుసరించి పొమ్ము. కొంతదూరము పోయిన తరువాత నీకు మహేంద్రనాథమహర్షి మఠము గనుపించును. నీవు ఆయనదగ్గఱ నుండుము. నేను వచ్చెదనని పలికి సొరంగపు ద్వారమును బంధించి బయటికివచ్చెను. దుర్గము అప్పటికే మొగలాయీలతో నిండిపోయినది. లాలబీ సౌందర్యవిశేషుఁ డగు చంద్రసింహుఁ డామెకొఱకు ప్రతిభాగమును పరిశీలించు చుండెను. మానసింహుఁడొక చాటునదాగి దీనినంతను పరిశీలించుచుండెను. ఆకస్మికముగ నిద్దరు ముసల్మానులు మాన సింహుఁడున్న చోటికివచ్చిరి మానసింహుఁడు వారితో యుద్ధముచేసి వారిని యమపురమునకు పంపివైచెను. అచటనుండి మరియొకభాగమునకు బోయెను. అచట మరల వేఱొక మొగలాయీ యెదురుపడెను. ఆతనిమీఁదకు కత్తినెత్తునంతలో వెనుకనుండి "వద్దు. వద్దు. ఆతఁడు ఖుదాబక్సుఖాన్" అనుమాటలు వినిపించెను. వెనుదిరిగి చూచునప్పటికి నాథూ యచట నిలిచి యుండెను. వెంటనే వారుముగ్గురును అచటినుండి తప్పించు కొని సొరంగమునుజొచ్చిరి. పాపము లాలబీ పిఱికొఱకచట నెదురుచూచుచునే యున్నది. మానసింహుని చూచుటతోడనే "అన్నా! నాథూ వచ్చినాఁడా" యని ప్రశ్నించెను. నాథూ

"అమ్మా నేను కుశలముగనే యిచటకు చేరితిని. వచ్చునప్పుడు ఖుదాబక్షుఖాను నుగూడ వెంట గొనివచ్చితినని పలికెను. పలు గుడ నడువ నారంభించిరి. మార్గమధ్యమున లాలబీ తలిదం డ్రుల గతి యేమగునోయని బాధపడెను. ఆమెబాధను గ్రహించి నాథూ "అమ్మా! వారిరువురును నాకన్నుల యెదుటనే బంధింప బడిరి. తరువాత నేమి జరిగినదో నాకు తెలియదు. పారిపోవల యునని నాకు మహారాజు సంకేతము చేసినాడు. నే నాయన యభిప్రాయమును గ్రహించి పారిపోయి వచ్చితిని. నాప్రాణ ములు పోవునని నాకు భయములేదు గాని ఈయినుపపెట్టె కొరకు అట్లు చేయవలసి వచ్చినది" అని పలికెను.

ఖుదాబక్షుఖాను లాలబీకు ధైర్యమును కలుగజేయుచు "అమ్మా! నీ తల్లిదండ్రులను గురించి విచారింపకుము. నేను ముసల్మానుడను గనుక నన్నెవ్వరును పట్టి బంధింపరు" అను ధైర్యముతో నచటనే నిలిచి వారి సంభాషణ వినియున్నాను. రహస్యమంతయు నర్థమయినది. దేశద్రోహియయిన చంద్రసిం హుడు నిన్ను వివాహము చేసికొనుటకు మహారాజున కొక లేఖ వ్రాసెను మహారాజునకు చంద్రసింహుని క్రూరస్వభా వము బాగుగ తెలియును. వెంటనే యాలేఖను తిరస్కరించెను. మహారాజు నవమానించుటకు సమయమును వెదకుచుండెను. దైవవశమున నాథూ యిచటకు వచ్చుట, దుర్గాదాసు సహా యమునకు సైన్యము పంపుటకు ఏర్పాటు జేయుటయు నాతనికి తెలిసినవి. వెంటనే మొగలుసరదారుడగు ఇనాయతుఖాను

వద్దకు పరుగెత్తి మహాసింహుని వృత్తాంతమును తెలియఁ జేసెను. ఇనాయతుల్ఖాను వెంటనే మహాసింహుని రాజద్రోహిగ నిర్ణయించి మాడోసంస్థానముపై దాడిచేసెను. ఇది యంతయు నీకొఱకు జరిగినది. భగవంతుని దయవలన నీవా దేశద్రోహిచేఁ జిక్కలేదు. చిక్కినయెడల నీమానమర్యాదలు మంటగలసి యుండును. చంద్రసింహుఁడు ఇఁక తపస్సుచేసినను నీజాడ కనుగొనలేడు. నీవు కనుపించలేదను క్రోధముతో నీతల్లిదండ్రులను బంధించి సోజిత దుర్గమున నుంచుటకు నిశ్చయించినాఁడు. భగవంతు డనుగ్రహించినయెడల రెండు మూఁడు రోజులలో వారు విముక్తులు కాఁగలరు'' అనిపలికెను.

మాటలు చెప్పుకొనుచు సారంగము చివరకు వచ్చిరి. మానసింహుఁడు ముందుగవచ్చి ద్వారమును తెరిచెను. ఒక్కొక్కరుగ నందఱును బయటికి వచ్చిరి. సారంగము మఠములో కలిసియున్నది. మఠములో మనుజుల సవ్వడి విని మహేంద్రనాథులు అచటికి వచ్చిరి. ఆదివ్యజ్యోతి కందఱును సాగిలఁబడిరి. యోగీంద్రులాశీర్వదించిరి. వారి ప్రశ్నయవసరము లేకుండగనే మానసింహుఁడు మొగలాయీల దండయాత్రను దానికిఁ గల కారణములను సంపూర్ణముగ తెలియజేసెను. యోగీంద్రులు మందహాసముతో లాలబాయిపు నిముకుచు ''అమ్మా! భయపడకుము. ఇచ్చట సంతోషముతో నివసింపుము. నీకొఱకిచట నొక దాసిని నియమించెదను. నీకు కష్టము కలిగించగల వాఁడెవ్వఁడును ఇచటలేఁడు'' అని యామె నోదార్చి మిగిలిన వారందఱి

కీని ధైర్యము చెప్పిరి. వారందఱికిని నిద్రించుటకొక స్థలము నేర్పాటుచేసి వెడలిపోయిరి. ఒకవంక శత్రుభీతి. మరియొకవంక శత్రువిజయమున కాలోచన. ఈరెండును నిద్రాదేవిని దూరముగఁ గొనిపోయినవి. కష్టముతో రాత్రి గడిచినది. ఉదయమయినది ఖుదాబక్షుఖాను వెడలిపోవుట కనుజ్ఞ గోరెను. మహేంద్రనాథులు తొందరయేలయని ప్రశ్నించిరి. ఖాను వినయముతో "అయ్యా! నేను ముసల్మానుఁడను. ముస్లిములు చేయు ఘోరదురాచారములకు సిగ్గుపడుచున్నాను. పరస్త్రీల మానమర్యాదలను మంటగలుపుట, దీనులను సంహరించుట ముసల్మానుల ధర్మములుగావు. సిసలయిన ముసల్మాను ఎన్నడును అబలలమీద చేయినెత్తడు. నాకు పోవుట కనుజ్ఞనిండు. నాకు చేతనైనయినంతవఱకు పరోపకారము చేయుటకు ప్రయత్నించెదను. ఇఁక నీదేశమున నిలువజాలను" అని పలికెను. తరువాత మానసింహునిఁ గౌగలించుకొనెను. జ్ఞాపకార్థము పరస్పరము ఖడ్గవ్యత్యయము గావించుకొనిరి. ఖాను మహర్షికి నమస్కరించి బయలుదేరెను. కొన్ని యడుగులు పోవునప్పటికేమి జ్ఞాపకము వచ్చినదో వెనుదిరిగి వచ్చి మానసింహునితో నిట్లనియెను. "సోదరా! ఆకత్తితో నెన్నడును ప్రాణభిక్ష కోరు పిఱికివానిని సంహరించకుము" మానసింహుని నేత్రములశ్రుపూర్ణములయినవి. నిజాయితీగల ఆముసల్మాను సైనికుడు కంటికి కనుపించు పఱకు నచటనే నిలిచి చూచెను.

ఖాను పయనముతో నాథూ మొదలగువారికి చేయివిడిచి నట్లయ్యెను. వారందఱును సావకాశముగఁ గూర్చుండి నా ము సల్మాను యోధుని గుఱించియే చర్చించుచుండిరి. ఇంతలో దూరమునుండి యొక యాక్రందన వినఁబడినది. తోడనే సాధు పురుషుఁడగు మహేంద్రనాథుఁడు అచటికేగెను. ఒక రాజ పుత్రుని కొందఱు తురుష్కులు బంధించికొనిపోవుచు కొట్టు చుండుట కంటబడెను. మహేంద్రనాథుఁడు వారిని సమీపించి కారణమడిగెను. అందులో నొకఁ డిట్లనెయెను."అయ్యా ఈతడు మహాసింహుని పక్షమువాఁడు. ఆతని యుంగర మతనిదగ్గఱ నుండుటయె యందులకు సాక్ష్యము" ఆ మాటలాకా సాధు పురుషుఁడు మీరు చెప్పినది సాక్ష్యముగాదు. ఒక్క నిముసము నేఁ చెప్పునది వినుడు. ఈ యుంగరము నెవరిదగ్గఱనుండి యయినను బలాత్కారముతో లాగికొని యుండవచ్చును. లేదా మహాసింహు డిచ్చియుండవచ్చును. లేదా మహా సింహునిదగ్గరనుండి దొంగిలించి యుండవచ్చును. కనుక ఉంగరమున్నంత మాత్రమున మహాసింహ పక్షపాతియని నిశ్చ యించుటకు వీలుఁలేదు మీ మతగ్రంథమయిన కురాను నిర్దో షుల పీడించుట పాపమని చెప్పుచున్నది. కనుక ప్రస్తుతమున కీతనిని విడిచివేయుడు. నేను విచారణచేసి దోషియయిన నీతని మీకప్పగించెదను. నిర్దోషియయిన విడిచివేసెదను అని పలి కెను. సాధువచనములు తురుష్కనాయకునికి నచ్చినవి. వెంటనే యాతని మహేంద్రనాథు నధీనము గావించిరి.

ఋషిపుంగవుఁడగు మహేంద్రనాథుఁ డాతనిని మరము నకు కొనివచ్చి "నాయనా! మహాసింహుని యుంగర మెట్లు వచ్చినది? నీవు పోవు ప్రయాణ మెచటికి?" అని లాలనతో నడిగెను. ఆలాలనకు రాజపుత్రుని మనసు కలతచేసినది. "మహాత్మా! మీరు నా ప్రాణరక్షకులు. మిమ్ముల విశ్వసించుట న్యాయము. నాసంగతి వినిన మీరే ప్రాణభక్షకు లగుదు రేమో యను భీతి పీడించుచున్నది. మీరు మాకు హితచింతకు లని నమ్మకము కలుగునంతవఱకు నీ విషయమును తెలుపఁ జాలను క్షమింపుము" అనియెను. రాజపుత్రుని కంఠస్వరము లో నున్న వృద్ధాసేనకుడు నాథూ చెవినిఁ బడియెను. అతని కంఠ స్వరమాతనికి పరిచితమయినదివలెతోచినది వెంటనే యాతనిని పరిశీలించుటకు వెలుపలికివచ్చెను. నాథూను చూచుటతోడనే యాతనిని రాజపుత్రుఁడు గుర్తించి "నాథూ! నీవిచట నేమి చేయుచున్నావు? మహాసింహుఁడు దుర్గాదాసునకు సహాయము చేయుటకు తగిన యేర్పాట్లు ఏమయినను గావించినాఁడా? లేదా?" అని ప్రశ్నించెను. రాజపుత్రుని ప్రశ్న నాథూను ఆశ్చర్యములో ముంచివైచినది. "సహాయము చేరలేదా? నిన్ననే రెండు భాగముల సైన్యములు పంపబడినవి" అని సంశయించుచు పలికెను. నాథూ మాటలు అతనికికూడ విస్మయము కలిగినవి. "ఎవరును ఇంతవఱ కచటికి రాలేదు. నాలుగువైపులను ముసల్మానులు ముట్టడించిరి. తిండితినుటకుఁగూడ తీరిక లేదు. మఱిరెండు రోజులిట్లే గడచిన యెడల మార్వారు దేశము

సర్వనాశమునొందును" అని విచారించుచు పలికెను. ఈమాటలకు మహేంద్రనాథులు "ఎందులకీ నిరాశ ? మార్వాడు దేశము స్వతంత్రమయితీరును. వీరమూర్తి దుర్గాదాసు విజయిడగును. ఆతని యభిలాష తప్పక నెఱవేఱును. పౌరుషమును విడనాడక తగిన యుపాయమాలోచింపుడు. నేడే బయలుదేరి కళ్యాణ సింహుని యొద్దకు పొండు. అచట మీకు వలయు సహాయము దొరకును. దీనిని వెంటనిడుకొని యారావళీ పర్వతములకు పోయి దుర్గాసునకు సహాయ మొనరింపుడు. మీకు తప్పక జయము కలుగును" అని వారిని హెచ్చరించిరి.

మహేంద్రనాథుల యాజ్ఞానుసారము మానసింహ కోణసింహులు సహోదరియయిన లాలబానద్ద సెలవు దీసికొని కల్యాణసింహుని యింటిదగ్గరకు చేరిరి. అప్పటి కర్ధరాత్రియయి నది. ద్వారపాలకు లందఱు ఒడలు మఱచి నిద్రించుచుండిరి. వీరిరువురు మొదట ద్వారపాలకులను మేల్కొలిపిరి. వారు ప్రభువునకు వీరియాగమనము నెఱింగించిరి. కల్యాణసింహుడు అర్ధరాత్రి వచ్చిన వారిని జూచి కంగారుపడి "నాయనా ! కుశ లమేగదా ? ఇంతటి యర్ధరాత్రమున వచ్చుటకుగల కారణ మేమి యని ప్రశ్నించెను. మానసింహుడు కల్యాణసింహునకు పాదాభివందన మాచరించి "తమకు మాడోసంస్థాన విశేషము లను విననేలేదా ? దుష్టాత్ముడగు చంద్రసింహుడు తనతో సరదారు ఇనాయతుఖానుని తీసికొనివచ్చినాడు. ఇంటిగుట్టు లంకకు చేటన్నట్లు ఈదుర్మార్గుడు శత్రువుల జేరుటతోడనే

వారు సులభముగ కోటను వశపఱచుకొనిరి. మహాసింహుఁడును అతని రాణియును బద్ధులయిరి. చంద్రసింహుఁ డింత చేయుట లాలబాను వరించుట కొఱకే. వీరమూర్తి దుర్గాదాసు లాలబా, అమరసింహులను రక్షించు కొఱకే జోరావరుఖానుని సంహరించినాఁడు. ఇప్పుడనుభవించుచున్నది యీ హత్యాఫలితమే" వృద్ధిమాతహాతయయినది. ఆరావళీ పర్వతదుర్గములు విశ్రాంతి స్థానములయినవి. అచటను సుఖమును మృగ్యతయినది. ముసల్మానులు వచ్చి నలుమూలల ముట్టడించిరి. పాపము! పుణ్యమునకు పోయిన పాపమెదురయినట్లయినది. ఇట్టి పరోపకారి యగు పురుషునకు సహాయము చేయవలయునని మిమ్ముల కోరుటకు వచ్చితిమి" అని యావృత్తాంతమును తెలియఁ జేసెను. కల్యాణసింహుని మనస్సు సంశయగ్రస్తమయినది. ఏమిచేయుటకు తోచలేదు. తుదకిట్లనియెను. "నాయనా! నీవు చెప్పినది యథార్థమే. మా గ్రామము చిన్నది. నేను దుర్గాదాసునకు సహాయము చేసినసంగతి ఔరంగజేబునకు తెలిసిన మా గ్రామము నామరూపములు లేకుండ నశించిపోవును" అని తన భయమును తెలియఁజేసెను. ఈ మాటలు మానసింహునకు నచ్చలేదు. వెంటనే "బాబా! రాజపుత్రులు ఎన్నడును భయపడి బ్రతుకలేదు. నేఁడు మీరు చూపిన భయము రాజపుత్రుల చరిత్రలో నెవ్వఁడును జూపలేదు. దేశస్వాతంత్ర్యము కొఱకు సర్వస్వత్యాగ మొనరించుట రాజపుత్రుల ధర్మము.

మీమనసు భయాక్రాంతమయిన మీపు యుద్ధమునకు రావద్దు. మీ యొద్దనున్న రాజపుత్ర యోధులను కొందఱిని సహాయమునకు పంపుడు. ఇందువలన మీ మీద నపరాధమారోపించుటకు సావకాశముండదు'' అని బోధించెను. మానసింహుడు బోధించిన మీఁదట కల్యాణసింహుఁడు నెబ్బదిమంది రాజపుత్రులను దుర్గాదాసు సహాయమునకు వెడలుట కాజ్ఞాపించెను. మానసింహుఁడు వారిని వెంటఁబెట్టుకొని దుర్గాదాసునకు సహాయ మొనరించుటకు ఆరావళీపర్వత సానువులఁ జేరెను.

## ఐదవ ప్రకరణము

మొగలు ఫాదుషా ఔరంగజేబు ''కంటాలియా'' గ్రామాధిపతియగు షంషీఖాను మరణవార్త వినినతోడనే క్రోధమును బట్టజాలకపోయెను. క్రోధ వివశుఁడగు నాతఁడు వెంటనే ''దుర్గాదాసును బంధించి తీసికొనిరండు. ఆతఁడు మరణించిన శిరమును ఖండించిరండు.'' అని యాజ్ఞాపించెను రాజాజ్ఞ దాటరానిదిగదా! స్వతస్సిద్ధముగనే హైందవ విద్వేషులగు మొగలులు ఈయాజ్ఞచే నుప్పొంగిరి. ఏమైననుసరే! దుర్గాదాసును బట్టితీరవలయునని నిశ్చయించిరి. సముద్రమువలె పొంగి పొరలు మొగలుసేనావాహిని ఆరావళీపర్వతపంక్తు

లను చుట్టుముట్టినది. దుర్గమములగు ఆరావళీపర్వత సానువుల నతిక్రమించుట దుష్కరమని గ్రహించినది. ఈ విషయమున తర్జనభర్జనము లనేకములు జరిగినవి. కాని పర్వతము నెక్కి శత్రువులను జయించుటకు గుండె నిబ్బరముకలవాఁ డొక్కఁడును లేకయ్యెను. చివరకు పర్వతము మీఁదికి పోవుమార్గముల నన్నిటిని సరికట్టి రాకపోకల నాపుచేసి ఆకటిమంటలయందు రాజపుత్రులను దహించుటకు నిశ్చయించిరి. పైనుండి క్రిందికి వచ్చుటకును క్రిందినుండి పైకిపోవుటకును మనుష్యుల పరీక్ష యావశ్యకమయ్యెను. శవము నైనను పరీక్షింపక విడువజాల కుండిరి. ఇట్టి కఠోర పరివేష్టనమున రాజపుత్రుల క్షుధాగ్ని హెచ్చినది. వన్యములగు కందమూల ఫలాదులు గతియైనవి. అవియు క్రమముగా అరుదు కాఁజొచ్చినవి. నేటికి మూఁడు దినములనుండి శుష్కోపవాసములు జరిగినవి. రాజపుత్రులు కర్తవ్య నిర్వాహణయందు ధృఢవ్రతులై నిలిచియుండిరి. కాని కోమల హృదయుఁడగు దుర్గాదాసు రాజపుత్రుల కష్ట పరంపరను చూడఁజాలకపోయెను. మిక్కుటమగు మనఃక్లేశము నను భవించుచు నిట్లనియెను. "సోదర రాజపుత్రులారా! సహాయము మును పంపుటకు వెళ్ళిన నాథూవెళ్ళి నేటికి నాలుదినములైనది. అతఁడుగాని అతఁడు పంపిన సహాయముగాని కానరాదు. పాపము అతఁడు మాత్రమెట్లు సహాయము పంపగల్గును? మానసింహునివద్దకు సహాయభిక్షకొఱకుఁగదా అతఁడు పోయి యున్నాఁడు! మిత్రులారా! ఒకనాఁడు విశాల విశ్వమునందు

రాజపుత్ర శౌర్యాగ్ని దుర్నిరీక్ష్యమై ప్రజల సన్నగిలనంది యున్నది. కొలదినాళ్ళకు పూర్వమే మహారాజగు యశోవంత సింహుడు మరణించినపిమ్మట ఇరువది వేలమంది మహమ్మదీయులతో రెండువందల యేబది రాజపుత్రయోధులు యుద్ధముచేసి యున్నారు. నేడు ఆ రాజపుత్రులే పరిమితములగు మహమ్మదీయ సైన్యముల జూచి యిల్లుదూరి యుండుట ఎంతటిదౌర్భాగ్యము! సహృదయులారా! నిర్భాగ్యుడనగు నన్ను దురదృష్టవంతునిగా నా దేశమును విడిచి మీరు మీ స్వగృహముల కరుగుట మంచిది. నాతోబాటు ఈ కష్టముల నేల యనుభవింతురు. తెలిసియో తెలియకయో నేను ప్రతిజ్ఞ చేసియుంటిని. స్వేచ్ఛా జీవినై జీవించెదను. లేదా! స్వాతంత్ర్యముకొరకు సోదరీ భూదేవిని శరణుజొచ్చెదను” అనెను.

ఖిన్నుడగు దుర్గాదాసును జూచి రాజపుత్రులు ఉద్రిక్తులై “మహారాజా! మనశరీరములకు భేదముగాని, ప్రాణములకు భేదములేదు. ఎచ్చట దుర్గాదాసు నివసించునో యచ్చటనే యీ రాజపుత్ర సమూహము నివసించును. మారాష్ట్రకు రాజ్యము స్వాతంత్ర్యము కానంతవఱకు మాకంఠములందు ప్రాణ ముండగా స్వగృహములకు పోజాలము. ఇది మా నిశ్చయము” అని విన్నవించిరి.

నిరాశాపూరిత హృదయుడగు దుర్గాదాసు నేత్రములు ఆకటిమంటలకోర్చు రాజపుత్రుల సాహసమునుగాంచి యశ్రుసిక్తములైనవి. వాడిపోయిన ఆశాలత మరల నొకసారి పల్ల

వించినది. ప్రసన్నవదనుడై "క్షుద్బాధతో మరణించుటనీచము. యుద్ధముచేసి మరణించిన వీరస్వర్గము చూరగొనవచ్చును. సహాయము లభ్యమైనను కాకపోయినను యుద్ధముచేసి తీర వలయును. దిగుడు. ఈపర్వతము క్రిందిభాగమును చేరుదము." అని పలికెను.

ఆ పర్వతమార్గము మిగుల భయంకరమైనది. కంటకలతలు యల్లిబిల్లిగ నల్లుకొని ప్రమత్తులగు పాంథులను కాల్చివైచుటలో నేర్పుగలవి. ఒకచో పల్లము నొకచో మిట్ట. ఈ మార్గమున ప్రయాణము చేయుటకు పశువులే భయపడునపుడు మనుజులమాట ఒకలెక్కయా. మరణమును లెక్కింపని రాజపుత్రులకిది లెక్కయా! రాజపుత్రులు పర్వతమును దిగుటకు ప్రారంభించిరి. ఇంతలో దుర్గాదాసు దూరమునుండి వినిపించు రామనామమును విని యచ్చటనే నిల్చిపోయెను. ఎదుట నలువురు మనుజులు ఒక శవమును మోసికొని వచ్చుచున్నారు. దాని వెనుకనొక మానవుడు నిప్పును ఒక నీటిచెంబును పుచ్చుకొని వచ్చుచున్నాడు. మరికొలది దూరమున నూర్గురు జనులు గలరు. ఆవచ్చు వారందరును ఈవైపునకే. దీనినంతయు చూచి దుర్గాదాసు ఆశ్చర్యమందెను. స్మశానము ఆదిశనున్నది. వీరు ఈవెపునకు వచ్చుచుండిరేమని యాతని సంశయము. ఇంతలో నాలుగురు మనుజులు దుర్గాదాసును సమీపించి యాతని ఎదుట యాశవమును విప్ప నారంభించిరి. ఇది జూచిన దుర్గాదాసు నాశ్చర్యమునకు హద్దులేదు. ఇది యేమి భగవంతుడా!

యని యాతని యాలోచన. కట్లువిప్పిన వెంటనే యొక రాజ పుత్రుడు దుర్గాదాసు పాదమున వ్రాలెను. దుర్గాదాసాతని లేవనెత్తి ఆశీర్వదించుచు సోదరా! ఎవ్వడవీవు. నీచరిత మేమి? ఇది స్వప్నమా? లేక నిజముగనే నేను జూచుచున్నానా? నిజమైనచో నీవిట్టి కఠినతర శ్రమకోర్చి యింత దూరము వచ్చుటకు కారణమేమి? యని ప్రశ్నించెను. ఇంతలో వెనుక నిలబడియున్న రూపసింహుడు ముందుకువచ్చి నమస్కరించి మహారాజా! ఈతడు వీరరాజ పుత్రుడు. ఈతని నామధేయము గంభీర సింహుడు, తమసాన్నిధ్యము చేయుటకు ఇటునటు వికలహృదయుడై తిరుగుచు దైవయోగమున మమ్ముగలిసెను. మేమును ఈతనివలెనే పైకివచ్చుటకు తెరువుగానక వ్యాకులహృదయములతో తిరుగుచున్నాము. ఏమిటిచేయుట? తురుష్కసేనావాహిని మార్గముల నన్నిటిని నిరోధించియున్నది. కాని గంభీరసింహుడు ఈ యుపాయమును మాకు తెలియజేసెను. మేమాతనిని శవమువలె కట్టగట్టి యిటుతీసికొని వచ్చితిమి. మార్గమధ్యమున మూడునాల్గు ప్రదేశములయందు తురుష్కులు కట్లువిప్పి పరీక్షించుచున్నారుగాని గంభీరసింహుడూపిరి బిగబట్టి శవమువలె వారికి గాన్పించినాడు. కనుకనే మొగలుల కేవిధమగు శంకను కలుగలేదు. నిజమాలోచించిన యెడల మీకు సహాయము చేయుటకు సమర్థుడు మానసింహుడు గాని గంభీరసింహుడుకాడు. అని ముక్తకంఠముతో బలికెను.

దుర్గాదాసు గంభీరసింహుని ఆకారమును, చాతుర్య మును చూచి యచ్చెరువందెను. ఆతని చూచినతోడనే యాతనియందు దుర్గాదాసున కొకవిధమగు విశ్వాసము కుదిరి నది. దుర్గాదాసు ప్రేమపురస్సరముగా గంభీరసింహుని కౌగ లించుకొని నాయనా! మార్వాడు దేశము జీవించి యున్నంత వఱకు నీకు ఋణపడియుండును. నీచాతుర్యము, సాహసము, కార్యతత్పరత మార్వాడ్రాజ్యమును స్వతంత్రము గావింప గలవు అని సంతోషమునఁ బలికెను. ఇంతలో రూపసింహుఁడు "మహారాజా సూర్యాస్తమయమగుచున్నది. మార్గమా! దుర్గమ మైనది. కటికచీకటులు కష్టమును కలుగజేయును. కావున వీలై నంతవఱకు శీఘ్రముగ ప్రయాణము చేయుట మంచిది. రాజ పుత్రు లాకలిగొనియున్నారు. ఈమార్గము నాచరించిన తురు ష్కులు కొలదిమంది మాత్రమే. మనము కొంచెము జాగురూ కతతో కత్తి చవిచూపిన యెడల విజయము సాధ్యము." అని విన్నవించెను. దుర్గాదాసు ఆతని వాక్యమును మన్నించి రాజ పుత్రుల కాజ్ఞయిచ్చెను. వెంటనే రాజపుత్రులు ఆకలిగొన్న సింగపుగొదమలవలె మొగలాయి సేనలపై విఱుచుకుపడిరి. యుద్ధము జరిగినది కొంచెముసేపు మాత్రమే. కాని యతి భయంకరమైనది. వేలకొలది తురుష్కమస్తకములు తాటిపండ్ల వలె రాలినవి. యజమానికి కబురుచెప్పుట కొక్కఁడుతగా త్రుఁడు కూడ మిగులలేదు.

దుర్గాదాసు మనస్సు ప్రసన్నమైనది. సమీపమున విఘ్నములేవియు కానరాలేదు. వారందరు మహోత్సాహముతో ఆరావళీ పర్వత సానువుల నధిగమించి భవిష్యత్కార్యమును గూర్చి యాలోచించుటకు ఒక చక్కని సమతల ప్రదేశమున నాగిరి. ఏమిచేయవలయును. ఎచ్చటకు పోవలయును అనునది యొక్కటి సమస్యయైనది. సమస్య ముగియకుండగనే దూరమునుండి ఒక ధ్వని వినవచ్చినది. "దుర్మార్గుడా! ఎందుకు నన్ను చంపెదవు, నేఁజేసిన యపరాధమేమి ? రక్షింపుము. రక్షింపుడు. పాపాత్ముఁడా ! అబలపైనా నీబలము చూపుట. నాకుకూడ కత్తినిమ్ము. నాసామర్థ్యము చూపెదను" ఈ వాక్యములు వినిన వెంటనే దుర్గాదాసచట ఒక క్షణముగూడ నిలువజాలకపోయెను. ధ్వని వినవచ్చుదిశ కాతఁడు శీఘ్రవేగమున పరుగిడిపోయెను. ఆతని వెనుక గంభీరసింహుఁడు, యశకరణుడు కూడ పరుగిడిపోయిరి.

దుర్గాదాసు అనుచర సమేతముగా నచటికి జేరి యొక పురుషుఁడు ఒక అబలను బలాత్కరించుటను గాంచెను. అంధకారము గాఢమగుటచే వారిని గుర్తింపజాలక పోయెను. ఎవ్వఁడవు నీవని గర్జించి పలికెను. "పోవయ్యా నేనెవ్వడనో యడుగుటకు నీవెవ్వడవు ? నేనేమి చేయుచున్నానో నీకెందులకు" అని యీసడించుచు నామనుజుడు జవాబిచ్చెను. "సరిగా సమాధానము చెప్పలేవా యనుచు దుర్గాదాసు ఖడ్గహస్తుడై యాతని మీఁది కురికెను. ఆతడును దుర్గాదాసును కొట్టుటకు

కత్తినెత్తిన వెంటనే వెనుకనున్న గంభీరసింహుఁడాతని తలను గొబ్బరపుచ్చినవలె నెగురఁగొట్టెను. దుర్గాదాసా యువతిని సమీపించి "అమ్మా నీవెవతెవు. ఈ దుష్టుఁడెవఁడు ? నీవీ దుర్మార్గుని కెట్లుచిక్కితివి అని ప్రశ్నించెను. ఆయబల భయము తీరినదై "తండ్రీ నేను మాడోసంస్థానపు మహారాజగు మహా సింహుని పుత్రికను నాపేరు "లాలబా" ఈదుర్మార్గుఁడు చంద్ర సింహుఁడు. తానువన్నిన కపటోపాయమునకు తగిన ఫలము ననుభవించినాఁడు" అని జవాబిచ్చెను. ఇంతలో దుర్గాదాసు మనుజులు పరుగిడు సవ్వడిని విని వెనుదిరిగి చూచెను. గంభీర సింహుఁడు, యశఃకరణుఁడును పరుగిడుటవల్లన కలిగిన దాసవ్వడి. ఖడ్గహస్తుఁడగు దుర్గాదాసు వారి నిరువురను అనుకరింపవలయునని తలచెను గాని లాలబా" మరల దుర్మార్గుల బారిపడుననుశంకచే నామె రక్షణకై యచ్చ టనే నిలచిపోయెను. స్వల్పకాలములోనే గంభీరసింహ, యశఃకరణు లిరువురు కళ్ళెముల చేతఁబుచ్చుకొని యైదు గుఱ్ఱములతో నచ్చట ప్రత్యక్షమై "ప్రభూ! ఈతనితోఁగూడ మరిమువ్వురు అనుచరులు గలరు. వారినిగాంచి మేము వెన్నాడ తిమి మృత్యువు సమీపించిన వారికి గుఱ్ఱములనెక్కి పారి పోవుట కవకాశమెట్లు కలుగును! వారి నిటకు తీసికొనివచ్చినది వారి మృత్యుదేవతయే. ఆ దేవత వారిని నరకమున కీడ్చు కొనిపోయి గుఱ్ఱములను మాకై యిచ్చట వదలినది." అని విన్నవించిరి.

విధముల తర్కవితర్కములు చేసినపిదప తేజబాయే యీజరిగిన మోసమునకు కారణమని నాకు విశ్వాసము కల్గినది". అని పల్కెను. గంభీరసింహుడు ఆమె నధిక్షేపించుచు నిట్లనెను "చంద్రసింహుని నీవెఱుంగుదువు. అతని స్వభావము నీకు స్పష్టముగ తెలియును. ఐనను నీవాతని మాయాజాలమున నెటుల చిక్కుకొంటివి. అంతట లాలబా తన తెలివిని సమర్థించుకొనుచు నిట్లనియెను "ఉంగరమును తీసికొని వచ్చినవాడు చంద్రసింహుడు కాడు. మరియొక రాజపుత్రుడు. అతడు చంద్రసింహుని సహచారియని విషయము నాకిట్లు తెలియును. అతడు వచ్చి మీతండ్రి మానసింహుడు నిన్ను పిడిచి మిక్కిలి దుఃఖించుచున్నాడు. నిన్నాతనితో గూడ నుంచుటకు నీతల్లి తేజబా నిన్ను తీసికొని రమ్మనినది" అనినాడు. నేనామాటలు విని శరీరమును మఱచిపోతిని. నన్ను నమ్మించుట కాతడు అంగుళీయకమును జూపెను. నేను మహాధిపతియగు మహేంద్రస్వామి సన్నిధిం జేరి యాతని యనుమతి తీసికొని యాదుర్మార్గునితో బయలుదేరితిని. తరువాత నీయాపదయందు చిక్కుకొంటిని. సర్వశక్తిశాలియగు సర్వేశ్వరుడు మిమ్ములను బంపి యీ దుర్మార్గుల కోర్కెలను భగ్నముజేసి నన్ను రక్షించెను.

మహావీరుడగు దుర్గాదాసు ఆమె మనసునకు ధైర్యము జూపుచు "అమ్మా శత్రుదుర్భేద్యమగు స్థలమున నీకేవిధమగు నపాయము జరుగకుండ నిన్నుంచి రక్షించు బాధ్యతను నేవహించెదను భయపడకుము" అని ఓదార్చెను. అంతట లాలబా

“కాదు నేనిక మీరిట నొంటరిగ నివసింపజాలను. నన్ను రక్షించుటకు మీరు కంకణమును కట్టుకొని యున్నయెడల నన్ను మీతోడనే యుంచవలెను. నేను యోధవేషమును ధరించి యథాశక్తి మీకు సహాయము చేయుదును. నాకింతకంటె స్వరక్షణకు తగిన యుపాయము కనుపించుటలేదు” అని ప్రార్థించెను. క్షత్రియులకు సహజమగు సాహసము నామెయందు చూచి దుర్గాదాసు ప్రసన్నుడయ్యెను ఆమె యభిలాషను నెఱవేర్చుట కంగీకరించెను. గంభీరసింహుడు మరణించిన చంద్రసింహుని వస్త్రములను తీసి లాలబాను యోధపుంగవునిగా మార్చెను. ఖడ్గమును ధరించి గుఱ్ఱము నెక్కిన యామె రూపొందిన వీరరసమునలె దుర్గాదాసు ననుగమించెను. కొంతదూరము ప్రయాణము చేసిరి. కాని యంతలో నెవ్వడో వచ్చుచున్నట్లు చప్పుడయ్యెను. గంభీరసింహుడు సామాన్యుడుకాడు. మహావీరుడు. ముందునకు దుమికెను సుమారు ఇరువదిమంది మనుష్యులు యావైపునకే వచ్చుచుండుటను గమనించెను. చంద్రకాంతి వ్యాప్తి యయ్యెను. ఆకాంతిలో వారందరు రాజపుత్రులని స్పష్టముగ తెలిసినది. సమీపమునకు రాగానే గంభీరసింహుడు “ఎవరు మీరు” అని ప్రశ్నించెను. సమాధానము “నీవెవ్వరు” అని వచ్చెను. కంఠస్వరమును గుర్తించి గంభీరసింహుడు గుఱ్ఱము నుండి దిగి “సోదరా మానసింహ! నేను గంభీరసింహుడను” అని పలుకుచు మానసింహుని దుర్గాదాసు నెదుటకు తీసికొని

కత్తినెత్తిన వెంటనే వెనుకనున్న గంభీరసింహుఁడాతని తలను గొబ్బెరపుచ్చినటులె నెగురఁగొట్టెను. దుర్గాదాసా యువతిని సమీపించి "అమ్మా నీవెవతెవు. ఈ దుష్టుఁడెవఁడు ? నీవీ దుర్మార్గుని కేలఁజిక్కితివి అని ప్రశ్నించెను. ఆయబల భయము తీరినదై "తండ్రీ నేను మాడోసంస్థానపు మహారాజగు మహా సింహుని పుత్రికను. నాపేరు "లాలబా" ఈదుర్మార్గుఁడు చంద్ర సింహుఁడు. తానువన్నిన కపటోపాయమునకు తగిన ఫలము ననుభవించినాఁడు" అని జవాబిచ్చెను. ఇంతలో దుర్గాదాసు మనుజులు పరుగిడు సవ్వడిని విని వెనుదిరిగి చూచెను. గంభీర సింహుఁడు, యశకరణుఁడును పరుగిడుటవలన కలిగిన దాసవ్వడి. ఖడ్గహస్తుఁడగు దుర్గాదాసు వారి నిరువురను అనుకరింపవలయునని తలచెను గాని లాలబా" మరల దుర్మార్గుల బారిపడుననుశంకచే నామె రక్షణకై యచ్చ టనే నిలచిపోయెను. స్వల్పకాలములోనే గంభీరసింహ, యశకరణు లిరువురు కళ్ళెముల చేతఁబుచ్చుకొని రెండు గుఱ్ఱములతో నచ్చట ప్రత్యక్షమై "ప్రభూ! ఈతనితోఁగూడ మరిముగ్గురు అనుచరులు గలరు. వారినిగాంచి మేమువెన్నాడ తిమి మృత్యువు సమీపించిన వారికి గుఱ్ఱములనెక్కి పారి పోవుట కవకాశమెట్లు కలుగును! వారి నిటకు తీసికొనివచ్చినది వారి మృత్యుదేవతయే. ఆ దేవత వారిని నరకమున కీడ్చు కొనిపోయి గుఱ్ఱములను మాకై యిచ్చట వదలినది." అని విన్నవించిరి.

గంభీరసింహుని ధ్వనిని గుర్తించి 'లాలబా' గంభీరసింహునితో "అన్నా! ఈ యాపత్కాలమున నీవును నన్ను, గుర్తింపలేకపోతివిగదా" యని విలపించెను. అంత గంభీరసింహుఁడు "ఎవరు? లాలబా? నీవు దుర్మార్గులకెట్లు చిక్కితివమ్మా" యని అడిగెను. లాలబా ఊరార్పుతో ఇట్లనెను. "అమ్మ తేజబాయే యీనాడుస్థితికి కారణము. అన్నా 'తేజబా' లో క్షత్రియవంశమునకుండవలసిన లక్షణములు సున్న. రాజ్యభోగముల యందామెకు ఆశెక్కువ. భోగలాలసయగు నామె తన సంతానము గూడ సుఖకావలయునని కోరుచుండును. దుర్మార్గుఁడగు నీచంద్రసింహుఁడు ఉన్నతమగు నాశను కల్పించి ఆమెను మోసగించి ఆమెవద్దనుండి యంగుళీయకమునుసంగ్రహించెను.

ఆయుంగరమును చూపినవానివెంట నేను బయలుదేరి వచ్చెదనని యామెకు తెలియును." ఆమె మాటలకు ప్రతివాదము చేయుచు గంభీరసింహు డిట్లనియెను. 'తేజబా' చంద్రసింహునకంగుళీయకము నిచ్చినట్లు యెట్లు ఋజువుచేయఁగలవు? ఇనాయత్ ఖాన్ యుద్ధరంగమున 'తేజబా' మానసింహులను బంధించినపుడు ఆతఁడే వారియొద్దనుండి బలత్కారముగా నంగుళీయకము నేల సంగ్రహించి యుండకూడదు?" అని పల్కెను. అప్పుడు లాలబా "కాదు చంద్రసింహుఁడు బలాత్కారముగా నంగుళీయకమును సంగ్రహించినయెడల రహస్య మార్గమున నేను మహేంద్రనాథస్వామియొక్క మఠమును బ్రవేశించి యచటనే నివసించుచుంటినని యెట్లు తెలిసికొనగల్గును? శతవిధ

వచ్చెను. దుర్గాదాసు ఆదరముతో కౌగలించుకొనెను. మానసింహుఁడు లాలబాపైపు నకు చూచెనుగాని గుర్తింపజాలక పోయెను. ప్రక్కనున్న యశఃకరణుని "అన్నా నూతనుఁడగు యీరాజపుత్రుఁ డెవ్వఁడు" అని ప్రశ్నించెను. యశఃకరణుఁడు జవాబు నీయకుండగనే లాలబా "అన్నా! మానసింహా! నేను నీయనుంగు సహోదరినగు లాలబాను" అని పలికెను. మానసింహుఁడు లాలబావైపు రెప్పవాల్చక ఆశ్చర్యముతోఁ జూచుచు "అమ్మా నీవిచ్చట కెట్లు వచ్చితివి" అని యడిగెను. లాలబా ప్రారంభమునుండి చివరివఱకు నన్నివిషయములను వివరించి చెప్పెను.

అంతట మానసింహుఁడు పరమేశ్వరుడుచేయు ప్రతి కార్యమును మన మంచికొఱకే. నీరక్షణపై నీవు చేసిన యేర్పాటు చాల చక్కనిది. ఐనను విధివిలాసము నెవరు తప్పింపఁగలరు.

అచ్చటనుండి వీరందరు మహావేగముతో ప్రయాణము చేసి తమ సైన్యము చేరుకొనిరి. అచటకు అంతకుముందే మోహకసింహుఁడు, మేడతిసింహుఁడు కూడ వచ్చియుండిరి. ఇప్పుడు సైన్యమునందలి వీరులసంఖ్య అధికమయ్యెను. మొట్ట మొదట సోజితగఢమును జయించుటకు నిశ్చయించిరి. ఒక దెబ్బకు రెండు పిట్ట లనునట్లు సోజితగఢ విజయమును, మహాసింహుని విముక్తియు నను రెండు కార్యములు సాధ్యములగును. అర్ధరాత్రిదాటినది. దుర్గాదాసు తన సైన్యములకు ఆ అడవి

యందే విశ్రమించుట కనుమతి నొసంగెను. సోజితగఢమును జేరుటకది సమయముకాదు. సోజితగఢమును జయింపవలయు ననిన రాత్రియందే జయింపవలయును. పగటివేళ యల్పసంఖ్యాకులగు రాజపుత్రులు అసంఖ్యాకములగు మొగలులను, దుర్గమమగు సోజితగఢమును కూడ జయింపజాలరు. కనుకనే యీ రాత్రియు మఱునాటి పగటిని అచ్చట గడిపి మరల రాత్రి ప్రయాణముచేసి సోజితగఢ సరిహద్దునుజేరి దాడిజరుపుటకు సిద్ధముగనుండిరి.

గంభీరసింహుఁడు దుర్గముయొక్క ఆనుపానులను గుర్తించి ప్రణాళికని సిద్ధపఱచెను. అతఁడు నల్వురిని సింహద్వారపు పైభాగమున దాచి తాను దక్షిణపుగోడవైపునకు పోయి యచట మూలనుండి చెకుముకిరాయి తీసి నిప్పుచేసి యచ్చటనున్న చూరునకు నిప్పు నంటించెను. ఏవైపుజూచినను గడబిడయే. నిప్పు నార్పుటకు ఒకే పరుగులు. ఈ సందడిలో సమయముచూచి రాజపుత్రులు నల్వురు కోటలోనికి దుమికి దుర్గ సింహద్వారమును తెఱచివైచిరి. సింహద్వారమునకు వెలుపల వేచియున్న రాజపుత్ర సేనావాహిని యొక్కుమ్మడిగ దిక్కులు పిక్కటిల్ల నార్చుచు దుర్గములోనికిఁ జొరబడి భయంకర యుద్ధమును సలుపఁదొడగెను. అకస్మాత్తుగ పైబడిన రాజపుత్రుల నెదుర్చుటకు మొగలాయీలు సిద్ధముగ లేకుండుటచేత మిక్కిలి భయపడిరి. దావాగ్ని ప్రవేశించుట కెవ్వడిచ్చగించును. పిక్క బలమును చూపిరి. అనేకు లాయుధ విసర్జనముచేసి దుర్గాదా

సును శరణు జొచ్చిరి. పరాక్రమమునందు విశ్వాసముగల రాజపుత్రవీరుఁ డెవ్వఁడును శరణనిన వారిమీద చేయి నెత్తఁ జాలఁడు. ఆ భయంకర యుద్ధము నెదుర్కొనువాఁడు లేకుండుటచే సమాప్తి జెందినది. ఇనాయత్‌ఖాను రహస్యమార్గమున ప్రాణములను దక్కించుకొని పారిపోయెనని మానసింహాదులకు స్పష్టమైనది.

గంభీరసింహుఁడు దుర్గసింహద్వారముపై నెగురు మొగలాయీల పతాకమును తీసివైచి తత్‌స్థానమున రాజపుత్రపతాకమును ప్రతిష్ఠించెను. దుర్గరక్షణను యశఃకర్ణ, తేజఃకరణ, రూపసింహుల కప్పగించి దుర్గాదాస మానసింహులు, లాలబాయును మహారాజగు మహాసింహుని దర్శించుటకు చెఱసాల కేగిరి. వారిని జూచుటతోడనే ఆతనిమనస్సు కంగారుపడినది. ఉద్రేకభావముతో "భగవంతుఁడా! ఎంతదురదృష్టము. మీరుగూడ పట్టువడితిరా!" అని వాపోవు రాజునోదార్చుచు మానసింహుఁడు "బాబూ! విచారింపకుము. మనదుర్దినములు గడచిపోయినవి. పాపాత్ముఁడగు చంద్రసింహుఁడు యమధర్మరాజున కతిథియయినాఁడు ఇదిగో చూడు నీప్రియపుత్రికలాలబా వచ్చియున్నది. మేము సేవకులము గాము. స్వతంత్ర వీరులము. మహాత్ముఁడగు దుర్గాదాసు నిన్నినాడు మాఱోరాష్ట్రముతో బాటు సోజితదుర్గమునకుఁగూడ రాజును చేసినాఁడు. క్రూరాత్ముఁడగు ఇనాయత్‌ఖాను మాయమయి పోయినాఁడు లేకున్న నాతని చంద్రసింహునికిఁ నేనుగపంపియుండెడి వారమే. నేఁడీ

కోటమీద నెగురు మొగలాయీల పతాక మొగలాయీలు చేయు దుర్మార్గమునకు సిగ్గుపడి ప్రజలకు మొగము చూప జాలక మాయమయి పోయినది. ధర్మమార్గమునఁ బ్రవర్తించు రాజపుత్రుల ప్రతిష్ఠకు గర్వించుచు శోమ్మ్మ విడుచుకొను చున్న రాజపుత్ర పతాక ప్రజలకు కన్నులపండు వొనర్చు చున్నది అని యానందముతో తెలియచేసెను.

కష్టములలో మునిగిపోయిన మహాసింహుఁ డింతకు ముందెన్నడును ఇట్టి చల్లని మాటలను వినలేదు. మంచము నుండి లేచి ఆత్మభాగ్య విధాతయగు దుర్గాదాసును కౌగిలించు కొనెను. తరువాత మానసింహుని యక్కున జేర్చుకొనెను. తన ప్రాణములకు ప్రాణమయిన లాలబాను ఒడిలోనికి తీసికొని వెచ్చని బాష్పముల రాల్చెను. ఆ బాష్పధారచే చిరవియో గాగ్ని శాంతినొందెను. లాలబాయును పితృసమాదరణ విస్మృత దుఃఖయయ్యెను. ప్రక్కగదిలోనున్న తేజబా ఈ సందడిచే మేల్కొనెను. మధ్యమధ్య వినుపించుచు లాలబా వచనములచే నా సంభాషణ వినుట కామె యుత్కంఠిత యయ్యెను. లాల బాకు చెందిన మాటలు చెవిని పడుటతోడనే యామె గుండెలు కొట్టుకొన నారంభించెను. తానుచేసిన పనికి పశ్చాత్తాపము నందసాగెను. తన యవివేకమువలన గదా! ఇంతటి కష్టపరంపర కలుగుట యని వాపోయెను. లాలబా చరిత్రనంతయు మాన సింహుఁడు కథారూపమున మహాసింహున కెఱింగించెను. ఇంకను రాత్రి ఒకజాముచ్చది. దుర్గాదాసు అలసిపోయిన రాజ

పుత్రు లందఱకును విశ్రమించుట కనుజ్ఞ నొసంగెను. మిగిలిన భాగము ఆనందముతోఁ గడచిపోయినది. అరుణోదయ మయి నది. అరుణసారథి యరుణకిరణములు రాజపుత్రుల పతాకకు స్వర్ణచ్ఛాయ నలమివైచినవి. సోజిత దుర్గప్రాంత గ్రామవాసు లగు రాజపుత్రులు అరుణరాగరంజిత రాజపుత్ర పతాకను వీక్షించి యాశ్చర్యమగ్ను లయిరి. నిన్న సాయంతనమువరకు నున్న మొగలాయి పతాక ఉదయమగునప్పటికి మాయమగు టలోని మాయను గ్రహించుట కుత్కంఠితులయిరి. కొంతసేప టికి మొగలుల పరాజయమునందును రాజపుత్రుల విజయము నందును విశ్వాసము కలిగినది. గుంపులు గుంపులుగ సోజిత దుర్గమును చేరసాగిరి. ఢిల్లీలోఁ జరిగిన ఘోరయుద్ధమునుండి తప్పించుకొనివచ్చిన రాజపుత్రులు దుర్గాదాసు విజయవార్తను విని తురుష్కుల నేదో యొకవిధమున మట్టుపెట్టుటకు నిశ్చ యించుకొని తమసైన్యములలో దుర్గాదాసు సహాయము కొఱకు సోజిత దుర్గమునకు వచ్చి చేరిరి. దుర్గాదాసు రాజపు త్రులలో నింతటి యుత్సాహమును స్వాతంత్ర్య వాంఛనుజూచి ప్రసన్నుఁడయి అఘటనఘటనా సమర్థుఁడగు పరమేశ్వరునకు వందన శతము లర్పించి జోధపురముపై దాడివెడలుటకు నిశ్చ యించెను. సరదారు లందఱు ఈ యుద్ధమునకు ఏకగ్రీవముగ నంగీకారమును తెలిపిరి. తేజబా పుట్టినిల్లగు వాలీదుర్గమునకు తేజబాలాలబా మహాసింహులను దుర్గాదాసు స్వయముగ వెంటనిడుకొని తీసికొని పోయెను.

వాలీదుర్గమున మహాసింహ దుర్గాదాసు లిరువురును జోధపురముపై జరుపబోవు దాడినిగూర్చి ఏకాంతమునందుండి యాలోచించుచుండిరి. ఇంతలో ద్వారపాలుడు దేసురీనుండి వచ్చినగులాబసింహుడను వాని వర్తమానమును తెలియచేసెను. దుర్గాదాసు వానిని లోనికి ప్రవేశింప ననుజ్ఞ యొసంగెను. దుర్గాదాసాతని యాగమనకారణమును పృచ్ఛించెను. గులాబ సింహుడు "మహాత్మా! తమ సోజితదుర్గ విజయవార్త దేసురీ చేరగానే రాజపుత్రులందఱును ఆనందోన్మత్తులయి మహోత్సవమును జరిపిరి. కాని యచటి సరదారగు ఇనాయతుఖాను దీని నంతను జూచి క్రోధపరవశుం డయినాడు. వెంటనే దేసురీ యందున్న రాజపుత్ర ప్రముఖుల కందఱకును దర్బారునకు హాజరు కావలసినదని కబురు పంపెను ప్రముఖు లందఱును సమావేశమయిరి. కారణాంతరములచే మీ మామగారగు ఠాకూరు నాహరసింహుడును మాతండ్రిగారును కొంచెమాలస్యముగ సమావేశమునకు చేరిరి. ఇనాయతుఖాను తురుష్క విరోధులకు తగినశాస్తి జరుగుననియు అదియెట్టిదో ప్రస్తుతము ఊహింపరానిదనియు అనేక విధముల బెదరించి పురప్రముఖులకు తమతమ నివాసములకు తరలిపోవుట కనుజ్ఞ నొసంగి మీ మామగారిని మా తండ్రిగారిని మాత్రము కొంచెముసేపు వేచి యుండవలసినదని కోరెను. నిష్కపటులగు వీరికి తురుష్కుని కపటమెట్లు వగతమగును. వీరదుర్గాదాసుమీద గల వైరమును ఆతని బాంధవులమీద తీర్చుకొనుటకు నిశ్చయించు

కొనెను గాబోలు! వారియువురి మీాదను రాజద్రోహ నేర మునుమోపి రాజపుత్రు లెవరును లేకుండగఁ జూచి శిరఃఖండ నము చేయించెను" అని విన్నవించెను.

ఆహా! దేసురీనుండి వచ్చినవార్త యెంత కఠోరముగ నున్నది. తచ్ఛ్రవణ మాత్రమున దుర్గాదాసుని శరీరము వణకి పోయెను. పెదవు లదిరిపోయినవి. కన్నులనుండి నిప్పులు రాలి నవి. క్రోధావేశముచే కంఠము గద్గదికముగా యశఃకరణున కిట్లాజ్ఞాపించెను. "నీవు వెంటనే బయలుదేరి సోజిత దుర్గము నకు పోయి సైన్యసహితముగ 12 గంటలకు ముందే దేసురీ చేరుటకు సిద్ధముకమ్ము. ఈరోజుననే పాపాత్ముఁడగు నినాయతు ఖానుని యమలోకమునకు పంపితీరవలయును" ఈ యాజ్ఞను విన గులాబుసింహుఁడిట్లు విన్నవించెను. "మహారాజా! దేసురీ వార్తను వినగానే రూపసింహుఁడు ఇంచుమించు ఒకవేయిసైనికు లను తమ సహాయము కొఱకు ఇచటకు పంపియున్నాఁడు. ఈసమ యమునకు వారిచటకు వచ్చియుందురు". దుర్గాదాసు బయలు దేరిదుర్గద్వారమునకు చేరునప్పటికి, "మార్వార దేశము స్వతం త్రమగుగాక వీరదుర్గాదాసునకు విజయము కలుగుగాక" యను జయజయ కారములను చేయుచు రాజపుత్ర సైన్యము దుర్గ ద్వారమును చేరినది. దుర్గాదాసు వచ్చిన వారిసందఱను తగు రీతిని సన్మానించి వెంటనే యశ్వారోహణముచేసి వాహినీ నాయకుఁడయి యగ్రగామి యయ్యెను. సైన్యము లాతని ననుస

రించినవి. దుర్గాదాసు పార్శ్వమున మానసింహుఁడు, గంభీరసింహుఁడు యశఃకరణుఁడు తేజఃకరణుఁడు మొదలగువారు నడచుచుండిరి. గ్రామమును సమీపించగానే తమ యాగమనము ఒరులకు తెలియకుండునటుల ఎంతమాత్రము చప్పుడు లేకుండ నడువ వలయునని దుర్గాదాసు సైనికుల కాజ్ఞనొసంగెను. ఎచటిధ్వను లచటనే యాగిపోయినవి.

నిశ్శబ్దము రాజ్యమేలుచుండ రాజపుత్ర సైనికులు దుర్గమును ముట్టడించి దుర్గద్వారములను భేదించి దుర్గప్రవేశ మొనరించినది. గంభీరసింహుఁడు దుర్గమును బ్రవేశించి మార్గములోనే తప్పించుకొని వచ్చుచున్న ఇనాయతుఖానుని కలిసికొనెను. అప్పటికే యాతని ప్రాణములు సగముపోయినవి. మిగిలినవి గంభీరసింహుని స్వాధీనమయినవి. చేసినదానికి ఫలమనుభవింపవలదా ? గంభీరసింహుని తొలిదెబ్బకే యతఁడు నేలఁగూలెను. ఇనాయతుఖానుని ప్రాణవాయువు లెగిరిపోయినవి. పాపము మొగలాయీల సేనల కుత్సాహ మొసంగువాఁ డెవ్వఁడు ? నాయకుఁడులేని సేనలు చుక్కానిలేని నావగతి నొందినవి. సగము సేనలు రాజపుత్రుల చేతులలో మరణించినవి. మిగిలినవి దుర్గాదాసును శరణు జొచ్చినవి. రాజపుత్రవీరులు శత్రువులగు మ్లేచ్ఛులకు ప్రాణదానము నొసంగిరి. అచటినుండి మానసింహ గంభీరసింహులు కారాగారమును చేరిరి.

అచట చిరకాలమునుండి కారాగార వాసక్లేశము ననుభవించుచున్న రాజపుత్రుల నందఱను గౌరవపురస్సరముగ విముక్తులను జేసిరి. విముక్తులగు ఖైదీలహర్షధ్వానులచే భూనభోంతరాళములు ప్రతిధ్వనించినవి. రాజపుత్రు లందఱును దుర్గాదాసును పరివేష్టించిరి. దుర్గాదాసు ఆతురతతో వారి యోగక్షేమములను విచారించెను. అందఱును ఇష్టాలాపనముల నుల్లసిల్లిరి. ఇంతలో నరుణోదయమయినది. సప్తాశ్వునియరుణకాంతులచే మిలమిల మెఱయుచు దుర్గ బహిర్ద్వారమున రెపరెపలాడుచున్న రాజపుత్ర పతాకను జూచి సంతుష్టాంతరంగులయిన రాజపుత్రు లందరును ఆబాలగోపాలము దుర్గాదాసును సందర్శించుటకు వచ్చిరి.

ఒకజాముప్రొద్దుగడచినది. దుర్గాదాసు వచ్చినవారి నందఱను ఆదరించి ఆ దుర్గమునందుగల తన యత్తవారింటికేగి ఆత్మీయులనందరిని యథోచితముగ సన్మానించి యచటనే భుజించి ఒకజాము ప్రొద్దుమిగిలి యుండుగనే మరల దుర్గమునకు చేరెను. ఫాదుషా నెదుర్చుటయెట్లు? మార్వార్ దేశమున విజయము సాధించుటయెట్లు? అను విషయములను గుఱించి దేసురసరదారుఁడగు సురతానుసింహుఁడు గంభీరసింహుఁడు దుర్గాదాసును ఆలోచించుచుండగ దుర్గాదాస నామాంకితమగు లేఖ నొకదానిని గొని దూతయొక డచటికి వచ్చి చేరెను. చదువుట కాలేఖను దుర్గాదాసు గంభీరసింహుని కీయఁగా ఆతఁ డిట్లు చదివెను

రాజపుత్ర స్వాతంత్ర్య రక్షకుడును దయాస్వరూపుఁ
డను నగు దుర్గాదాస పూజ్యపాదులకు పుత్రికానిర్విశేష యగు
లేజబా వందన శతము లర్పించి వ్రాయునది.

మహాత్మా! తాము దేసురవిజయముకొఱకు సైన్య
సమేతముగ బయలుదేరి వెడలిన పిదప సమయమునుజూచి
పరుష్కులు "వాలీ" దుర్గముమీఁద దాడిచేసిరి. దుర్గము
నందున్న సేన స్వల్పమని మీరెఱుఁగుదురు. దానికితోడు మా
మామ పృథ్వీసింహుఁడు మొగలులసేన నెదుర్చుట అసంభవ
మని యూహించి స్వప్రాణత్రాణపరాయణుఁడయి పలాయన
మంత్రమును పఠించినాఁడు. విగతనాయకమగు దుర్గమును
మ్లేచ్ఛులు స్వేచ్ఛగ దోచుకొనిరి. దురదృష్టవంతులగు నాతల్లి
దండ్రులు నేనును బంధింపఁబడి జోధపురమునకు తీసికొని
పోబడితిమి. రాజద్రోహాపరాధమును మోపి తండ్రిగార్కి
మరణశిక్షను విధించిరి. రెండుమూఁడు రోజులలో ఈ యాపద
నుండి మాకు విముక్తి కలుగని యెడల తండ్రిగారి ప్రాణములు
తీయఁబడును. అప్పుడు మార్వాడ్ దేశము స్వతంత్రమయినను
కాకపోయినను మాకు తుల్యమే.

ఇట్లు,
లాలబా.

పత్రిశ్రవణమాత్రమున దుర్గాదాసు శరీరము
కోపముచే వణకసాగెను. కనుఁగొలఁకులనెఱ్ఱ తామరలు
వికసించినవి. అధరోష్ఠము దశనదష్టమయినది. పార్శ్వముల

ఘోనముగ ఉదయపురపు మహారాణా ఈ సైన్యమును పంపి నాఁడు'' అని తెలియుటతోడనే యాతని యానందమునకు హద్దు లేకపోయినది. ఆసైన్యమునకు ఎదురు సన్నాహము నిచ్చుటకు ముందునకు సాగెను రాణా రాజసింహుని జ్యేష్ఠపుత్రుఁడగు జయసింహుఁడు సైన్యాధిపతియయి ముందువచ్చుచు దుర్గా దాసును సమీపించినతోడనే గుఱ్ఱముఁదిగి దుర్గాదాసు నాలింగ నము చేసికొనెను. పరస్పరకుశల ప్రశ్నసమనంతరమున దుర్గా దాసు "జయసింహా! మీరు వచ్చుట కొంచెమాలస్యమయి యున్న యెడల మాసైన్యము కదలిపోయి యుండెడిది. జోధ పుర యుద్ధమునకు ఆయత్తులమయితిమి'' అని అనెను.

అంతట జయసింహుఁడు ''మహాత్మా! ఎందుల కింతటి యాతురత ? మొదట అజ్మీరును జయించి పిదప జోధపురము నకు పోవలయును'' అని మాయభిలాష. ఈస్వల్ప సైన్యముతో జోధపురమున కేగి మీరేమి చేయగలరు ? అపజయము ప్రత్యక్షముగ కనఁబడుచుండ ప్రయాణము సాగించుట కేవ లము సాహసమే యగును'' అని పలికెను.

దుర్గాదాసు చిఱునవ్వుతో "సోదరా ! జయాపజయ ములు పరమేశ్వరాధీనములు ప్రయత్నము మాత్రమే పురుషా ధీనము. జయాపజయ వివక్షలేకుండగ జోధపుర యుద్ధమునకు సిద్ధమగుటకు ముఖ్యకారణ మొకటికలదు. మహమహాసింహుఁడు సకుటుంబముగ శత్రుహస్త గతుడయినాఁడు. ప్రస్తుతము వారందఱును జోధపురముననున్నారు. రెండు మూఁడు రోజు

లలో మహాసింహుఁడు వధింపఁబడవలెనని యాజ్ఞ యయినది. ఇట్టి పరిస్థితులలో నేను చేయవలసిన ధర్మమెట్టిదో సెలవిండు ? అని పలికెను.

మహాసింహుని చరిత్ర శ్రవణ మాత్రముననే ఉద్రిక్తుఁడ యిన జయసింహుఁడు "సోదరా మనమిచట క్షణకాలమయి నను విశ్రమించుట తగదు. నేను 10 వేల రౌతులను 25 వేల కాల్బలమును వెంటగొని వచ్చినాఁడను. దీనికివలయు నేర్పాటు లను చేయుడు" అని విన్నవించెను. దుర్గాదాసు మొత్తము ఏబదివేల సైన్యమును 5 విభాగములుగ చేసెను. ప్రతి దాని యందును కొంత అశ్వసైన్యమును కాల్బలమును గలవు. మానసింహ, యశఃకరణ, కేసరీసింహ, జయసింహ, కరణ సింహులను ఒక్కొక్క భాగమున కధిపతులుగ చేసెను. తాను సర్వసైన్య నిరీక్షకుడై వ్యవహరింప సాగెను. గంభీరసింహ తేజఃకరణులను తన కంగరక్షకులుగ నియమించి కొనెను.

యుద్ధభేరీ మ్రోగినది. జయజయ కారములచే భూన భోంత రాళములు దద్దరిల్లినవి. ఎటు చూచినను వీరావేశము పెచ్చుమీఱినది. రాజపుత్రులు వీరావేశముతో వేయు పద విన్యాసము లయదప్పకుండెను. తమ జాతికి పరమపూజ్యమగు యుద్ధదేవతా సమారాధనకు రాజపుత్ర సేనావాహిని జోధ పురమునకు పయనమయినది. ప్రతివాఁడును వీరాలాపసనాడు వాఁడే. మచ్చునకైనను పిరికితనము కనుపించుటలేదు. వీర మూర్తియగు దుర్గాదాసు మాతృదేశ స్వాతంత్ర్య సంపాదనకు

ప్రాణపణము నొడ్డుటకు ప్రమాణము చేసెను. ఇతర రాజపుత్రు లాతనితోఁబాటు బద్ధకంకణులయిరి. మాతృభూమిని దాస్య శృంఖలా విముక్తను చేయుటకు ప్రాణదానమున కందఱును సిద్ధముగనుండిరి. దేశాభిమాన విహీనుఁ డాసైన్యమున ఒక్కఁ డయినను లేడు. ప్రయాణ సమయము అర్ధరాత్రి. మార్గము కంటకాకీర్ణము. అయినను వీరావేశమున అలసట నెఱుంగ కుండిరి. ఆకలిదప్పులంతరించినవిగాని, యుద్ధపిపాస పెంపొందినది. కాలమానము గుర్తింపబడుటలేదు. సేనలు మరునాటి రాత్రి తొలిజామునకే జోధపుర ప్రాంతమునకు చేరినవి.

యుద్ధవ్యూహము మొదటనే దుర్గాదాసు బుద్ధిస్థమయి యున్నది. సేనలచట చేరఁగానే దుర్గాదాసు నాజ్ఞ ననుసరించి జయసింహుఁడు దుర్గప్రాగ్ద్వారమును, కరణసింహుఁడు పశ్చిమ ద్వారమును ముట్టడించిరి. అందువలనలోపలినుండిబయటకుగాని బయటినుండి లోనికిగాని రాకపోకలు లేకుండ పోయినవి. కేసరి సింహుఁడు తన దగ్గఱనున్న 10 వేల సైన్యముతోఁ బట్టనము నాక్రమించుటకు సిద్ధముగ నుండెను. మొగలాయీలకు ఎవ్విధమగు సహాయము లేకుండ పోవుటకును, సహాయహీనులగు వారు శీఘ్రముగ లొంగుపాటునకు వచ్చుటకును, దుర్గాదాసు ఇట్టివ్యూహరచనను చేసెను. బయటినుండివచ్చు మొగలాయీ సైన్యము నెదుర్కొనుటకును, అలసిపోయిన రాజపుత్ర సైన్యమునకు సహాయము చేయుటకును, మిగిలిన రెండు భాగముల సైన్యము నియుక్తమయ్యెను. రాజపుత్రులలో వీరా

వేశము పొందియుండుటచేతను, రాత్రి మొదటిజాము మాత్రము ముగియబోవుచుండుటచే దుర్గములోని మొగలా యీలందఱును వివిధ కార్యాసక్తులయి దుర్గరక్షణ యందు ప్రమత్తులయి యుండుటచేతను దాడిచేయుట కది అనుకూల సమయమయియున్నది. బుద్ధిశాలియగు దుర్గాదాసు సమ యము దాటనిచ్చునా? వెంటనే దాడిప్రారంభించుట కాజ్ఞ యొసఁగెను. దాడిప్రారంభమయిన సంగతి దుర్గములోని వారికి తెలిసినది. వారందఱును ఏకముఖమున యుద్ధసన్నద్ధు లగునప్ప టికి దుర్గద్వారము పగిలిపోయినది. ఆద్వారమున రాజపుత్ర సేనలోనఁ బ్రవేశించినది. భయంకర యుద్ధము ప్రారంభమయి నది. దుర్గద్వారమున యుద్ధభేరీ మ్రోగుచునే యున్నది. రణ చండీ దేవతపూజ యారంభమయినది. శత్రుమస్తకములచే ఉభయసేనలును రణదేవతా నైవేద్యమును ప్రారంభించినవి. ఒకవైపునుండి "అల్లాహో అక్బర్" అను ధ్వనులును వేఱొక వైపునుండి "హరహరమహాదేవ" అను ధ్వనులును మిన్ను ముట్టినవి. వీరావేశమున మైమరచిన రాజపుత్ర సైన్యములు రెండువైపులను ముట్టడించుటచే మొగలాయీలు బెదరిపోయిరి.

బెదరిన మొగలాయీ సైన్యమును జూచుటచే నాయ కుఁడగు దిలావర్ఖాను యొక్క గుండెలు జారిపోయినవి. పరా జయము నిక్కమని తోఁచినది. అయినను ధైర్యము చిక్కఁ బట్టి బెదరిన తన సేనలనిట్లు ప్రబోధింప సాగెను.

"కృతఘ్నతకంటె మహాపాపములేదు. పరదాస్యమున జీవించుటకంటె మరణము మేలు. ఇస్లాము గౌరవమును గాపాడుడు. ఖురానుమీఁద శపథముచేయుచున్నాను. యుద్ధభూమిని ప్రాణములతో విడువవద్దు. ఈ వాక్యములు మొగలాయీ సైన్యములమీఁద పనిచేసినవి. మొగలాయీలలో కలిగిన ఆవేశములు వర్ణనాతీతము. ఆకలిగొన్న వ్యాఘ్రములవలె మొగలాయి యోధులు రాజపుత్రసైన్యములమీఁద విఱుచుకొని పడిరి. విజయము తనదేయని సంతసించు రాజపుత్రులు ఈ ధాటికి తట్టుకొనలేకపోయిరి. వారి యాశలు నిరాశలయినవి. పాదములు యుద్ధభూమినుండి తప్పుకొనుటకు తత్తరపడినవి. మరికొంచెము సేపు ఉన్నయెడల నేమయ్యెడివో? కాని మృతశిష్టమయిన సేనతో వీరమూర్తి దుర్గాదాసు అచట ప్రత్యక్షమయినాఁడు. ఉభయ సేనానీకములలో కరాళఖడ్గకాంతులు మెఱుములయి మిఱుమిట్లు గొల్పినవి. ప్రబోధ పటహఘోషణములు, గర్జారావములును చెవులు చిల్లులపడఁ జేసినవి అవిచ్ఛిన్నముగ కురిసిన రక్తవర్షముచే భూమి నానిపోయినది. దుర్గాదాస దర్శనముచే రాజపుత్రులు ధృఢవ్రతులయిరి. "హరహర మహాదేవ" యనుచు విజయదేవి పాణిగ్రహణమునకు ముందుకుసాగిపోయిరి. హస్తములు యుద్ధావేశముతో ఖడ్గలాఘవమును ప్రదర్శించుచుండె పాదములు పెండ్లినడకలు సాగించినవి. ఈ సందడిలో ఒక తురుష్కవీరుఁడు దుర్గాదాసు వెనుకవైపునకుచేరి యాతనికి తెలియరాకుండగ నాతని సంహరించు

టకు కత్తి నెత్తెను. భగవంతునిలీల. ఈ దురాగతము గంభీర సింహుని కంటం బడెను. లేనియెడల ఆరోజుతో వీరమూర్తి దుర్గాదాసు అమరులలో కలసియుండెడివాఁడే. గంభీరసింహుఁ డాతనిమీఁదకు ఎంత వేగముగ నురికెనో తెలియదుగాని యీ వేగమునకు తట్టుకొనలేక ఆ తురుష్కుడు ఎత్తినకత్తితో గూడ ధరణీ తలమున పడిపోయెను. గంభీరసింహుఁడు క్రిందఁబడిన యాతని రొమ్మున కాలిడి పొడిచి వేయుట కుద్యుక్తు డయ్యెను. తన ప్రాణములు పోవునని యెరింగి ఆ తురుష్కుఁడు దుర్గా దాసును శరణు వేడెను. ఓహో! దుర్గాదాసు ఏమి దయావీరుఁ డయ్యా? కపట మార్గమున స్వప్రాణాపహరణకు కారకుఁడయి, నీచకార్య పరాయణుఁడయిన యీ తురుష్కుఁడు దుర్గాదాసు కటాక్షముచే ప్రాణభిక్ష నందెను. మొగలాయీ నాయకుని రొమ్ముపై గంభీరసింహుఁడధిష్ఠించుట చూచిన మొగలాయీ సైన్యము "ఇనాయతుఖాను చచ్చె" నని హాహాకారములు చేయ దొడఁగినవి.

ఇనాయతుఖాను పేరు వినిన దుర్గాదాసు ఆశ్చర్యముతో వెనుదిరిగి నిలిచి "ఎవఁడీ ఇనాయతుఖాను? ఆతఁడు దేసురీ దుర్గమున నాచే సంహరింపబడెనాఁడుకదా?" అని యడిగెను. కొంత విచారణ జరిగినపిదప "ఇనాయతుఖాను తన పోలికలు గల వేరొక తురుష్కుని తన వేషమును ధరింపఁజేసి దేసురీ నుండి పారిపోయెననియు, అచట దుర్గాదాసుచే సంహరింపబడిన

వాఁడు ఆసైనికుఁడే యనియు, ఇప్పుడిచట ప్రత్యక్షమయిన వాఁడు అసలయిన ఇనాయతుఖాను” అనియు తెలిపెను.

ఇంతలో పైనుండి దిలావరుఖాను ఉచ్చైస్స్వరమున “వీరమూర్తీ! మహాసింహునియొక్క ప్రాణరక్షణ కావలయు ననిన వెంటనే సైన్యముతో కోటవిడిచి వెలుపలికి వెళ్ళిపొమ్ము” అని పలికెను.

దుర్గాదాసు తలనెత్తి పైకిచూచెను. క్రూరుఁడయిన దిలావరుఖాను, ఉరిత్రాట బంధింపబడిన మహాసింహుఁడును ఆతనికి దృష్టిగోచరులయిరి. ఈదృశ్యము చూచుటతోడనే దుర్గాదాసుని నేత్రములు అశ్రుపూరితములయినవి. వెంటనే యాతడు రాజపుత్ర సైన్యములకు “దుర్గము విడిచి బయటికి పోవలయు” నని యాజ్ఞనొసంగెను. దీనినంతను చూచుచున్న మహాసింహుఁడు దుర్గాదాసుని పిలిచి “మహాత్మా! ఏల తప్పటడుగు వేయుచున్నావు. స్వాతంత్ర్య సమరమున ఆత్మార్పణ గావించిన రాజపుత్రులకంటె నాప్రాణములు అమూల్యము లయినవా? ఒకరోజున మరణించవలసిన ఈదేహము కొఱకు చేఁజిక్కిన విజయము నేల పోనాడుకొందువు. జన్మించిన వారికి మరణించుట సహజము? నేను మాత్రము ఉట్టిగట్టుకొని ఊఁగులాడుదునా? నాకొఱకు జయమును పరాజయముగ మార్చకుము” అని పలికెను.

ఈవిధముగ మహాసింహుఁడు దుర్గాదాసున కావేశము కలుగచేయుచుండగ దిలావరుఖా నాతని కంఠమునకు బిగించి

కట్టిన త్రాటిని లాగివేయుటకు సిద్ధముగ నిలిచియుండెను దీని నంతను చూచుచున్న గంభీరసింహుడు కోపమును బట్టజాలక పోయెను. వెంటనే ఇనాయతుఖానును ఆతని యెదుటకు లాగి కొని వచ్చి యిట్లనెను 'సరే! నీయిష్టము వచ్చినట్లు చేయుము. కాని ఒక సంగతి మాత్రము మఱవకుము. యుద్ధమర్యాద నతి క్రమించి చేజిక్కిన మహాసింహుని నీవు సంహరించిన యెడల నీకన్నుల యెదుటనే మాకు జిక్కిన మొగలుసర్దారుల నంద ఱను, ఒక్క మహాసింహుని వధకు బదులు తీర్చుకొనుటకు చిత్రవధ చేసినైచెదము. రాజపుత్రుడు ఆడినమాట తప్పడు".

గంభీరసింహ గర్జనకు దిలావరుఖాను కాలుసేతులు వణకి పోయినవి. గంభీరసింహునకు సమాధాన మిచ్చుట కేమియుం దోచలేదు. ఇనాయతుఖానునకు రాజసభలోఁగల గౌరవ మాత నికి బాగుగ తెలియును మహాసింహునకు జరిగిన యపకారము నకు బదులుగ ఇనాయతుఖానుని ప్రాణములు తీయబడిన యెడల తన ప్రాణములకు గూడ ముప్పుకలుగునని యాతనికి స్పష్టముగ తెలియును. దీనినంతయు నాలోచించి మహాసింహుని కంఠమునుండి త్రాటిని తీసివైచి దుర్గాదాసు వైపునకు తిరిగి "ఆర్యా! ఇకమీదట మహాసింహునకు ఏవిధమగు కష్టమును కలుగనీయన"ని నేను శపథము చేయుచున్నాను. రాజసమ్ము ఖమునుండి ఆజ్ఞలకొఱకెదురు చూచుచున్నాను. సూర్యాస్త మయము లోపున ఏవిధమయిన సమాచారము రానియెడల దుర్గమును మీకు స్వాధీన మొనర్చి సంధి చేసికొనగలను.

అనవసరముగ అమూల్యములగు నాయకుల ప్రాణములకు నష్టము కలుగనీయను. ఇది నానిశ్చితాభిప్రాయమని విన్నవించెను.

వీరమూర్తి దుర్గాదాసు దిలావరుఖానుని ప్రార్థన నంగీకరించెను. రాజపుత్రసైన్యము యుద్ధమును విరమించి విశ్రాంతి కొఱకు సమీపముననున్న పర్వతసానువుల నాశ్రయించినది. సైన్యమునందలి వృద్ధనాయకులు క్షతగాత్రులను వైద్యము కొఱకు రాజభవనమునకు పంపివైచిరి. యుద్ధము ముగియుటకు ముందుగనే కేసరీ సింహుఁడు పట్టణముతోఁబాటు రాజభవనమునుగూడ నాక్రమించుటయే ఇందులకు కారణము. పట్టణము నంతను కంచుకాగడాలతో వెదకినను మచ్చునకయినను ఒక్క తురుష్కుఁడుకూడ దొరకుట దుర్ఘటము. కేసరీ సింహుఁడు ప్రసిద్ధులగు మొగలు సేనానాయకులను రాజభవనముననే బంధించి వైచెను. పాపము! అభాగ్యుఁడగు ఇనాయతుఖాను కూడ అచట చేరవలసిన వాఁడయ్యెను. ముఖ్యములగు కార్యములను నిర్వర్తించిన పిదప వృద్ధుఁడగు సోనింగు సరదారుఁడు దుర్గాదాసు దగ్గఱకు వచ్చెను. అప్పుడు సరదారులందఱును ఒకచోట సమావేశమయి దిలావరుఖాను చేసిన శపథమును గుఱించి చర్చించుట ప్రారంభించిరి. అప్పుడు దుర్గాదాసు "మిత్రులారా! దిలావరుఖాను కుటిలాత్ముఁడు. ఆతని యాలోచనలో నేదో ద్రోహము ఇమిడి యుండుననుట నిక్కము. ఢిల్లీనుండి తప్పక సహాయము వచ్చునని యాతడు

పూర్ణముగ విశ్వసించి యున్నాడు. ఆవిశ్వాసముతోనే సాయం కాలమునకు యుద్ధము నాపియుంచవలయునని కోరియున్నాడు. కనుక మనమిప్పుడు ఢిల్లీనుంచి సేనలు జోధపురమునకు వచ్చునట్టి మార్గములనన్నింటిని ముట్టడించి పైచెదము. ఒకవేళ సహాయము వచ్చినయెడల మార్గమధ్యముననే దానిని అంతరింప చేయుట మంచిది'' యని యుపన్యసించెను దుర్గాదాసు చెప్పిన మాటలు అందఱకును సమంజసముగఁ దోచినవి. సైన్యములు జోధపురమునుండి ఢిల్లీపోవు మార్గమునకు రెండు వైపులను పర్వతకందరముల యందుఁ దాగియుండి శత్రుసమాగమనమున కెదురు చూచుచున్నవి.

సూర్యదేవుఁడు నభోమండాల మధ్యగతుఁడయి ప్రజోపకారమునకు చండకిరణజాలమును వెదజల్లుచున్నాఁడు. ఇంతలో నొక గూఢచారి మహావేగమున జనుదెంచి తురుష్కసేనావాహిని సమీపించుచుండుటను దుర్గాదాసున కెఱింగించెను. దుర్గాదాసు చేసిన యాలోచన ఫలించినది. అనుకొనిన విధముగనే శత్రుసేన వచ్చినందుల కాతఁడు మిక్కిలి సంతోషించి సర్వసన్నద్ధముగ నుండుటకయి రాజపుత్ర సైన్యమునకు సంజ్ఞ యొనరించెను. ఇది జరిగిన కొంతసేపటికి మొగలాయీ చక్రవర్తియొక్క ధ్వజము నెగురవైచుచు మహమ్మదుఖానుని నాయకత్వమున నొక విశాల తురుష్కసేనావాహిని బయలుదేరి వచ్చుట స్పష్టముగఁ గనుపడెను. ఆ వచ్చెడి సైన్యము రెండు పర్వతముల మధ్యనుండి ప్రయాణము చేయవలసి యున్నది.

పర్వతకందర మార్గమున తురుష్కసేన ప్రవేశించినతోడనే రాజపుత్రులు హరహరమహాదేవయని జయఘోషలు సల్పుచు శత్రువులను ముట్టడించిరి. తురుష్కసేన ఎంత గొప్పదైనను పర్వతకందర మార్గమున ప్రవేశించుటచే పనికిమాలిన దయ్యెను. వెనుకనున్నవారు ముందునకు వచ్చుటకు వీలుదిక్కులేదు. ఇంతలో వీరులయిన యశఃకరణ గంభీరసింహులు మొగలాయీ ధ్వజమును ఊడబెఱికి దాని స్థానమున రాజపుత్రుల రక్తధ్వజమును నెలకొల్పిరి. మఱికొందఱు సేనానాయకుని బంధించిరి.

నాయకుడులేని సేన చుక్కానిలేని నావవంటిది. నాయకుడు బద్ధుడయ్యెననువార్త చెవిని పడగనే తురుష్క సైన్యములు చెల్లాచెదరయి వెనుదిరిగి పారిపోనారంభించినవి. రాజపుత్ర విజయ సూచక తూర్యనాదములు దిక్కులపిక్కటిల్లినవి.

దుర్గాదాసు ప్రసన్నచిత్తముతో మరల దుర్గమునకు తిరిగి వచ్చెను. దుర్గాద్వారమున సైన్యములతో నిలిచి, వెనుకటి నియమప్రకారము దుర్గమును స్వాధీనము చేయవలయునను వార్తను దిలావరుఖానునకు పంపెను. దుర్గమును స్వాధీనము చేసికొనుటకు మహాసింహుని బంధవిముక్తుని చేయుటకును మానసింహ గంభీరసింహులను పంపెను. వీరిని చూచుటతోడనే దుర్గరక్షకులు దుర్గద్వారములను తెఱచి తాళములను వీరికి అప్పగించిరి. ఈదుర్గమునకు వీరివుయను క్రొత్తవారు. దుర్గమార్గముల నెరుగరు. కనుక అచటనున్న సైనికులలో

నొకనిని సహాయముగ తీసికొని కారాగారమునుజ్జేరి లాలబా, తేజబాలను, మహాసింహుని బంధవిముక్తులనుజేసి రాజభవనము నకుఁ గొనిపోయెను.

---

## ఆరవ ప్రకరణము

మానసింహ గంభీరసింహులను దుర్గమునకుఁ బంపి విక్రమ శాలియగు దుర్గాదాసు కేసరీసింహుని యాధీనమున మొగ లాయీసర్దారులనునలుగురను కారాగారమునకు బంపివై చెను. జోధపుర రక్షణకు తగిన యేర్పాటులను జేసెను. పట్టుబడిన తురుష్క సరదారులలో ఔరంగజేబు పుత్రుడగు అగ్బరు ఖానుకలడు. యుద్ధతంత్రముల నాలోచించు చుటకు తన సర్దారుల నొకచోటచేర్చి సభచేసెను. ఆ సభ యందు అవసరములగు ముఖ్యవిషయములను జర్చించి వారి యనుమతితో సమీపగ్రామవాసులగు తురుష్కుల నందఱను బంధించి వైచెను. నిరపరాధులగు వారిని రాజకీయ కారణము లచే బంధించెనేగాని శత్రుత్వముచేఁ గాదు. కనుకనే బద్ధులను మైత్రితో నాదరించెను.

మాతృదేశమునకై మరణించుటకు దుర్గాదాసెల్లప్పు డును సిద్ధముగనే యుండును. జాతిరక్షణకును దేశహితమున కును ఎంతటి కష్టసాధ్యమగు కార్యము నయినను ఆతఁడు సాధించి తీఱును. అట్టి సాహసము దేశభక్తియుఁ గలవాఁడ

గుటచేతనే దుర్గాదాసు నేఁడు ఆచంద్రతారార్కమగు కీర్తిని గడించియున్నాఁడు.

జోధపుర విజయవార్త విశ్వవ్యాప్తమయినది. దుర్గాదాసును పిటికెమరీడువాఁడని పరిహసించినవారే యిప్పుడాతని పరాక్రమ గానమునకు భట్టుమూర్తులయిరి.

ఇంతను ముందెన్నఁడును కనివిని యెఱుఁగని ప్రజాసమూహము మిన్నుముట్టు కోలాహలము చేయుచు వీధులలో నిండిపోయినది. పురబహిః ప్రదేశమున దుర్గాదాసు సమావేశము నేర్పాటు చేసెను. రాజద్వారమునుండి సభాప్రాంగణము వరకు ఇసుకవేసిన రాలనంతగ జనము క్రిక్కిఱిసిరి. ఇటునటు సంచరించు జనమును జూచిన పూర్ణిమనాఁడు సంచలించు సంక్షుబ్ధ సాగరము స్మృతికి వచ్చుచుండెను. దుర్గాదాసు దర్శనమునకు ప్రజాహృదయములు తహతహపడుచున్నవి. భవనోపరితలములు దృశ్యజన సమూహములచే నిండిపోయినవి. గవాక్షముల నుండి తొంగిచూచు లలనా వినీల నేత్రమాలికలు ఆ శుభసమయమునకు మంగళ తోరణములయినవి. జయజయ ధ్వనులు మిన్నుమిట్టుటచే ప్రక్కవాని మాటకూడ వినఁబడుట దుష్కరమయినది. ఎవనినోట విన్నను దుర్గాదాసు వీరగాథలే.

ఆనందపరవశులగు నుద్యోగులు దుర్గాదాసును తీసికొని వచ్చి సమున్నతాసనమున సుఖాసీనుని గావించిరి. ఒక మహారాజు చిత్ర విచిత్రములగు పుష్పమాలలచే దుర్గాదాసు కంఠమును అలంకరించెను. వేరొక జాగీర్దారు పరిమళయుక్తమగు

మంచి గంధమును పూసెను. ఉదయపుర మహారాణా పంపిన రాజోచిత వస్త్రాలంకారాదుల నాతని పుత్రుఁడు భీమసింహుఁడు దుర్గాదాసునకు కానుకగ నొసంగెను. ఆకానుకను ఆదర పూర్వకముగ గ్రహించి దుర్గాదాసు శిరమున నుంచుకొని సమీపమున నేయున్న ఒక పీఠమునుండి లేచినిలఁబడి నమస్కరించుచు మందహాసముతో తన ప్రజల కిట్లుపన్యసించెను.

రాజగురువులును పూజ్యులును అగు పండితోత్తములకు నమస్కారములు. ప్రియమిత్రులారా! ఈ నాఁడు మిత్రులగు మీరు చేసిన గౌరవసన్మానములకు నేను ఆజీవితాంతము మీకు ఋణపడి యుందును. నేనీనాఁడు నిర్వహించిన గురుతరకార్యమును స్వజాతి రక్షణకు, స్వదేశ రక్షణకును, స్త్రీమాన సంరక్షణకును, దేశాభిమానముగల ప్రతి రాజపుత్రుఁడును మొగలాయీలు చేసిన దుర్నయములకు ఉగ్రుఁడయి అవలీలగ చేయఁగలఁడు కాని దేశమును శత్రువిముక్తమును చేసితినన్న మాటనునాకు దక్కించుట భగవంతుని యిచ్ఛ గావుననే ఆ సర్వేశ్వరుఁడు నన్నీ కార్యమునకు సాధనముగ చేసినాఁడు. దానికనుగుణముగనే కార్యకలాపమంతయు జరిగినది. సోదరులారా! సర్వాంతర్యామియగు సర్వేశ్వరుని సాక్షిగ నేను మీయెదుట ప్రమాణము చేసి చెప్పుచున్నాను. నా కెట్టివిధమగు రాజ్యకాంక్షయును లేదు. నేను ఏకొంచెమయినను చేసినయెడల నది నా దేశము కొఱకును నాజాతి కొఱకును నారాజు కొఱకును చేసి యున్నాను. మహారాజు ఎక్కడ? అని మీయుద్దేశ్యము.

సమయమువచ్చినది గనుక ఆ రహస్యమును మీకు తెలియ చేయుచున్నాను. మహారాజు కనిష్ఠపుత్రుఁడు చిరంజీవియై వర్ధిల్లుచున్నాఁడు. అతని పోషణ రహస్యముగ జరుగుచున్నది. అనతికాలములోనే సమయము వచ్చినప్పుడు మీరందఱు రాజ కుమారుని దర్శనము చేయగలరు.

ఇట్లు గంభీరముగ నుపన్యసించి దుర్గాదాసు తనస్థానము నలంకరించెను. జయజయ ధ్వానములు మిన్ను ముట్టినవి. ఏవంక జూచినను దుర్గాదాస ప్రశంసలు పెచ్చుమీఱినవి. ఈ కోలాహలమును హస్తసంజ్ఞలచే వారించుచు మహాసింహుఁ డిట్లుపన్యసించెను. ప్రియసోదరులారా! మీరు ధన్యులు. దుర్గా దాసును గన్న రాజపుత్రజాతి ధన్యమయినది. మొగలులతో వైరమును దానికిగల కారణమును దుర్గాదాసు మీ సమ్ముఖ మున వివరించి యున్నాఁడు. అది యంతయు అక్షరశఃసత్యము. ఇంకను వివరించవలసిన సత్యము మిగిలిపోయినదనవచ్చును గాని పొల్లు యెంతమాత్రమునులేదు. వీరదుర్గాదాసు పూజ్యుఁ డును పితృతుల్యుఁడును మహారాజును అగు యశవంతసింహుని యొక్క యాజ్ఞను సంపూర్ణముగ పరిపాలించి యున్నాఁడు. సర్వేశ్వరానుగ్రహమున స్వల్పకాలముననే రాజపుత్రుని పట్టాభిషేకమహోత్సవమును కన్నులపండువుగ మీరెల్లరును దర్శింపగలరు.

ఈ రెండు ఉపన్యాసములను వినిన ప్రజానీకము పులకిత మైనది. కంఠముగాద్గద్యమును వహించినది. "మార్వాడ్ దేశ

ము కొఱకును రాజపుత్రుని కొఱకును సర్వస్వమును త్యాగముచేయుటకు మేమందఱమును సిద్ధముగ నున్నాము” అను ధ్వని సాగరఘోషవలె ఘూర్ణిల్లినది.

మహాసింహుఁడు పాలనలె పొంగిన ప్రజల యావేశమును చూచి ప్రఫుల్లమానసుఁడయ్యెను. తదనంతర కార్యనిశ్చయమునకుఁగూడనద్దియే తగిన యదనని గ్రహించి రాజగురువగు జయదేవునివైపు సాకూతముగ దృష్టిని సారించెను. పండితుఁడాదృష్టియందలి యాంతర్యమును గ్రహించెను. రాజగురువు సామాన్యుఁడగునా? మాఖశుద్ధపంచమినాఁడు అజమేరులోనున్న ఔరంగజేబుతో యుద్ధముచేయుటకు ముహూర్తము నిశ్చితమయినది. నిర్ణీత ముహూర్తమున కొకరోజుముందుగనే తమ తమ సేనా సమూహములతో నచటకు చేరుటకు సేనానాయకు లందరు వాగ్దానము చేసిరి. నాటికి సభముగిసినది.

---

## ఏడవ ప్రకరణము.

మాఖశుద్ధ పంచమినాఁడు నిర్దిష్టశుభముహూర్తమున దుర్గాదాసు సముద్రమువలె నుప్పొంగు రాజపుత్ర సైన్యమును వెంటనిడుకొని జేసురీసేరి యచట నంతకుముందే చేరియున్న రాజపుత్ర సైన్యములను గలసెను. దుర్గాదాసు తన ప్రయాణసమయమున ఖైదీలగు నలుగురు తురుష్క సరదారులను తన

సైన్యములతోఁగూడ బంధవిముక్తులను గావించి తనతోఁ గొనివచ్చెను. మొగలాయీ ఖైదీలను ఘాదుషా కప్పగించి వారివద్ద నున్న రాజపుత్ర ఖైదీలను విడిపించుటయే యీతని యుద్దేశ్యము.

ఖైదీలగు సరదారులలో నొకఁడగు అక్బరుఖాఁను తన తండ్రియగు నౌరంగజేబు దుష్టచేష్టలకు విరక్తుఁడయి యుండ దుర్గాదాసు ఆతనికి ఢిల్లీ రాజ్య పట్టాభిషేకము నాశపెట్టి తన పక్షమునకు త్రిప్పుకొనెను. అక్బరుఖాను తన సైన్యములతో దుర్గాదాసునకు బాసటయగుటకు మాటనిచ్చెను. ఈసంగతి యెట్లో ఔరంగజేబు చెవినిఁబడినది. కపటోపాయ ధురీణుఁడగు నౌరంగజేబు అక్బరుఖానునకును దుర్గాదాసునకును భేదములు కల్పించుట కొకలేఖను వ్రాయించి దానినొక ఫకీరుచే బుధవాడీ మైదానమున విశ్రమించియున్న దుర్గాదాసు డేరాలోఁ బడఁవేయించెను.

ఆయుత్తర మచటనున్న కాపలావానికి దొరికినది. దానినతడు తీసికొనిపోయి దుర్గాదాసున కిచ్చెను. రాజముద్రాంకితమయి అక్బరు నామమున నున్న యీ యుత్తరమును దుర్గాదాసు రాజనీతి ప్రేరితుఁడయి విప్పి చూడఁగా నందిట్లున్నది.

"ప్రియపుత్రుఁడు అక్బరు నాశీర్వదించి వ్రాయునది.

నేను తండ్రినగుటచేత నీచాతుర్యమును నీ యెదుట ప్రశంసింపరాదు కాని నేనెంత కొనియాడినను అది స్వల్పమే యగును. కాఫరులను మోసగించుటకు నీవు అద్భుతమగు

యుక్తిని బన్నితివి. కాని జాగరూకతతో నుండుము. దుర్గా దాసు కపటోపాయ చతురుడు. కార్యభంగము కాగలదు. ప్రతికార్యమునకు దైవరుఖానుయొక్క సలహాను తప్పక తీసికొనుము. ఆతడు ధార్మిక తురుష్కుడగుటచే నెల్లప్పుడును కాఫరుల వధ కనుకూలములగు యుక్తులను బన్నుచుండును. నీవు వ్రాయు నుత్తరములకు సమాధానములు వ్రాయుటమాని వైచితిని. ఆ సమాధానములు శత్రుకరగతము లయిన యెడల కార్యభంగము వాటిల్లును. నేనుత్తరములు వ్రాయని యెడల నీ యుత్తరములు నాకు చేరినవా? లేదా? యను విషయమున నీవు బాధపడి భవిష్యత్కార్యమును సరిగ నిర్వహింపజాల వేమోయను భీతిచే నీ యుత్తరమును తప్పని సరిగ వ్రాయుచున్నాను.

ఇట్లు,
ప్రియ జనకుడు.

ఉత్తరము చదివిన మరుక్షణమునందే దుర్గాదాసు మనస్సు క్రోధోద్రిక్త మయినది. అక్బరుఖానుమీద తీరని సందేహముప్పతిల్లినది. ఆ యుత్తరమును తీసికొని జయసింహుని డేరాకేగి ఇట్లనియెను. "ఈ తురుష్కులను ఈవిధముగనే విడచిపెట్టి అర్ధరాత్రి సమయమున నిచటినుండి సేనాసమేతముగ వెడలిపోవుదము. మనసేనలను దేవలాడి యందున్న పర్వతారణ్యములను దాచుదము. ఔరంగజేబు సైన్యసమేతుండయి యచటికి వచ్చును. అప్పుడు వెనుకనుండియు పార్శ్వ

ములనుండియు దాడి చేయుదము. రెండువైపులనుండి జరిగిన దాడి నాతఁ డెదుర్కొన జాలడు. పారిపోవుటకు ప్రయత్నించును. మూడువైపులను మనసైన్యము లుండుటచే పారిపోవుటకు ఎదుటనున్న కొండదారి మాత్రమే శరణ్యము కాఁగలదు. కొండదారిని ప్రవేశించెనా ఎలుకబోనున చిక్కినట్లే. మనకు నష్టము కలుగకుండగ శత్రువుల ననాయాసముగ సమయింపవచ్చును.అప్పు డౌరంగజేబు మనలను శరణు జొచ్చును,లేదా చచ్చును.కనుక నిట్లు చేయుటయే నాయభిప్రాయము''అనిపలికెను.

దుర్గాదాసు చెప్పిన యుపాయము జయసింహుని మనమున నాటికొనినది. రహస్యముగ రాజపుత్ర సరదారుల కీవిషయము వివరముగ నందజేయఁబడినది. అర్ధరాత్రి సమయమున నందఱును తమతమ సైన్యములను వెంటబెట్టుకొని బయలుదేఱి తెల్లవాఱు నప్పటికి దేవవాడీ యరణ్యముల తమ సేనలను దాచివైచిరి.

మఱునాడుదయమున అక్బరుఖాను దుర్గాదాసు గమనమును గుఱించి నిర్విణ్ణుఁడయ్యెను. ఎంత యాలోచించినను కారణము తోచలేదు ఆతని సహచరుఁడగు మహమ్మదుఖాను "రాజపుత్రులకును మహమ్మదీయులకును గల సహజవైరమే రాజపుత్ర సరదారుల విశ్వాసమును సడలించియుండును సరదారుల యొత్తిడికి తట్టుకొనలేక దుర్గాదాసు చెప్పకయే వెడలిపోయినాఁడు. నీవు దుర్గాదాసు నన్వేషించుము. తురుష్కులు గూడ నాడితప్పనివారని ఋజువు చేయుటకు నేను ఇతర సర

దాసులును ఔరంగజేబు సైన్యముతో యుద్ధమునకు సిద్ధమగుదుము" అని పలికెను.

ఈ పద్ధతి అక్బరునకు నచ్చినది. దుర్గాదాసు నన్వేషణమున కాతఁడు బయలుదేఱి పోయెను.

ఔరంగజేబు తనపుత్రులగు ముఅజ్జము, ఆజము అను వారి నాయకత్వమున నొక విశాలమగు సేనను అక్బరుఖానుతోఁబాటు విద్రోహులగు సరదారులను బంధించుటకు పంపెను.

మహమ్మదుఖాను తనసైన్యములతో మార్గమధ్యముననే ఔరంగజేబు సేనలను దాఁకెను. ఘోరయుద్ధము జరిగినది. మహమ్మదుఖాను వీరమరణము నొందెను.ఆజము, ముఅజ్జములు అక్బరు కొఱకు వెదకించిరి. కాని వారి ప్రయత్నము కొనసాగలేదు.

అక్బరు దుర్గాదాసు కొఱకు తిరుగుచు చివరకు శ్యామలదాసుని గలసుకొనెను. శ్యామలదాసు 500 రౌతులకు నాయకత్వము వహించి దేవవాడీకి గస్తి తిరుగుచుండెను. అక్బరును చూడగానే సైన్యరహస్యములను తెలిసికొనిపోవుట కాతఁడు వచ్చియున్నాఁడని శ్యామలదాసు మొదట సందేహించెను. కాని కొంత సంభాషణ జరిగినపిమ్మట నాతని సందేహము సమసిపోయెను. అక్బరుయొక్క నిజపరిస్థితి యాతని కవగత మగుట తోడనే యాతని దుర్గాదాసు నొద్దకు పంపివైచెను.

అక్బరును చూచిన తోడనే దుర్గాదాసు లజ్జితుఁడయి యిట్లనెను."రాకుమారా! నన్ను మన్నింపుము. నాజీవితములో

నేను చేసిన తప్పు ఇదొక్కటి మాత్రమే. నా జీవితమున నింత వరకు విశ్వాసఘాతుకత్వము నెఱుంగను. నిర్దోషిని సంహరించుట నెఱుంగను. కాని నీవిషయములో మాత్రము పొరపాటు చేసితిని. ఇందులకు కారణము నీ తండ్రి వ్రాసిన లేఖయే. దీని లోని కపటము గ్రహింపలేకపోవుటయే నేను చేసిన తప్పు. ఈ యుత్తరము నొకపర్యాయము చదువుము. ఇట్టి పరిస్థితులలో మా కర్తవ్యమేమిటో నీవే యొకసారి యాలోచింపుము." అనుచు లేఖ నాతని చేతి కొసంగెను. పాపము అక్బరుఖాను ఆ యుత్తరము చదివి నిర్విణ్ణుడయి దుర్గాదాసుతో నిట్లనియెను. "ఆర్యా! ఇందులో నీదోష మేమియులేదు. నాతండ్రి పన్నిన మాయావాగురములో మనము చిక్కుకొనియున్నాము. ఇది కేవలము నా దురదృష్టము లేకున్న నిట్లు జరుగదు. ఈ యుత్తరమువలన నా బ్రతుకు అధోగతి పాలయినదని స్పష్టముగ తెలియుచున్నది. మృత్యుదేవత కరాళ వక్త్రగహ్వరము తెఱచికొని నన్ను వెన్నాడుచున్నదన్నమాట. ఏ క్షణమున మీద పడునో తెలియదు. ఇంతకు నా యదృష్టమిట్లున్నది. ఎవ్వరేమిచేయగలరు నా నిమిత్తము యుద్ధమునకు సిద్ధలయిన ముహమ్మదు షైవరుఖానుల గురి యేమయినదో!"

"రాకుమారా! నేను చేసిన పొరబాటు వలననేకదా! నీ సర్దారులిరువురులు మరణించిరి" అని పరితాపముతో ననెను.

దుర్గాదాసిట్లు సంభాషించుచుండగనే దూరమునుండి తురుష్కసైన్యములు "అల్లాహూ అక్బరు" అను నినాదము

లచే తమ రాకను తెలియఁజేసినవి. ఆ నినాదములు విని దుర్గా దాసు అక్బరు విషయమున మరల ననుమానింప దొడగెను. దుర్గాదాసు సునికిని గ్రహించుటకు వచ్చిన గూఢచారి యితఁడయి యుండునా? యని యనుమానించుచు పర్వతమునుండి క్రిందకు తొంగిచూచెను. ఔరంగజేబు కొండకనుమలో ససైన్యముగ ప్రవేశించినట్లు కనుగొనెను. వెంటనే రాజపుత్రసైన్యములకు యుద్ధము చేయుట కనుజ్ఞనొసంగెను.

ఇది రాజపుత్రులతోడి రెండనయుద్ధము. దుర్గాదాసు దేవవాడీ ప్రాంతమున చక్కని యేర్పాట్లను చేసెను. అది యంతయు పర్వతప్రాంతము. మార్గములన్నియు కొండ కనుమలనుండియే పోవును. దుర్గాదాసు ఒక్క మార్గమును విడచి మిగిలిన మార్గముల నన్నింటి కప్పివేయించి నాలుమూలలను రాజపుత్ర సైనికులను కాపువెట్టెను. కనుకనే బెదరిపోయిన తురుష్క సైన్యములకు ఏమూలకు పోయినను రాజపుత్ర సైన్యము లెదురయినవి. గొల్లవాడు గొర్రెలను తోలినట్లు రాజపుత్రులు తురుష్కుల నందఱను ఆకనుమదారికి మళ్ళించిరి. కనుమయందు సైన్యములన్నియు ప్రవేశించినవి. తప్పించుకొని పోవుటకు మార్గము లేదనియు తన పని బోనులో ప్రవేశించిన యెలుకవలె నయినదనియు ఔరంగజేబునకు మొదట తెలియలేదు. సైన్యమంతయు పూర్తిగ కనుమలో ప్రవేశించిన తరువాత రాజపుత్రులు కనుమయొక్క ముఖద్వారమును గూడ మూసివైచిరి. పర్వతముల మీది కెగఁబ్రాకుటకు పర్వతములు

కొంచె మనుకూలముగ నున్నవి కాని అనుకొనినంత సులభ ముగలేవు. ఇంకను జాముర్రాత్రి మిగిలియున్నది. చంద్రాస్త మయమయినది. చీకటి నలుమూలలకు వ్యాపించినది. పైనుంచి రాజపుత్రులు రాళ్ళవాన కురిపించుచుండిరి. ఒక్కొక్క రాతి క్రిందపడి యనేకులు మరణించుచుండిరి. మరణించినవారి సంఖ్య యధికమగుచున్నది. మిగిలినవారు కూడ దెబ్బలవలన మృత కల్పులయిరి. ఒక్క మొగలాయీ కూడ జీవించి బయటికి పోరాదని యే రాజపుత్రులు ఈ యుపాయము పన్నిరి. మొగ లుల కళేబరములతో కనుమనిండిపోయినవి. కాని ఔరంగజేబు భాగ్యచక్రమును మార్చగలవాడెవడు? అదృష్టవశమున నాతని కొక చిన్నగుహ దొరకినది. పితాపుత్రులు భద్రముగ దానియందు కూర్చుని ప్రాణరక్షణ చేసికొనిరి. ఎట్లో రాజ పుత్రుల కన్నులనుండి తప్పించుకొని ప్రాణములతో అజ్మీరు చేరిరి.

చక్రవర్తి అజ్మీరు చేరినవెంటనే దేశములోని సేనల న్నియు నజ్మీరు చేరవలయునని యాజ్ఞల నొసంగెను. కొన్ని రోజు లెట్లయినను ఆలస్యముచేయు నుద్దేశ్యముతో జులూఫు ఖానుని దుర్గాదాసు నొద్దకు దూతగ, బంపెను. జులూఫుఖాను దుర్గాదాసును సందర్శించి నలువదివేల మొహరీలను బహుమ తిగ నొసంగి యిట్లనియెను. "చక్రవర్తి పుత్రవియోగమున, గుందుచున్నాడు. అక్బరుఖానును వెంటనే పంపుదని కోరుచు న్నాడు. లేనియెడల యుద్ధము తప్పదు". దుర్గాదాసును ఇతర

సరదారులును చక్రవర్తి కపటమును తెలిసికొని అక్బరుఖాను నెట్లయినను రక్షింపవలయునను నుద్దేశ్యముతో జులూఫుఖా నుని తిరస్కరించి పంపివైచిరి.

ఇంతలో నుదయపురపు యువరాజగు భీమసింహుఁ డచటికివచ్చి చక్రవర్తి సైన్యసేకరణను గూర్చి తెలిపెను. యుద్ధముకంటెఁగూడ అక్బరుఖానుని సంరక్షించుట ముఖ్య మని రాజపుత్రు లెల్లరును భావించిరి తర్జనభర్జనలు జరిగిన మీఁదట శివాజీ పుత్రుఁడగు శంభాజీనొద్ద నక్బరుఖానునుంచుట కెల్లరను నంగీకరించిరి. దుర్గాదాసు స్వయముగ నాతని శంభాజీ నొద్దనుంచి వచ్చెను.

దుర్గాదాసు సైన్యములను అజ్మీరు రణరంగమున కుటి కించెను. మహాఘోరమగు యుద్ధము జరిగినది. చక్కని మనో విశ్వాసముతో రాజపుత్రులు తురుష్కుల నెదిరించిరి. సగము తురుష్క సైన్యములు నశించినవి. సహాయము చేయుట కితర దేశములనుండి వచ్చుచున్న మొగలాయీలను శ్యామదాసు మార్గమధ్యముననే ఓడించెనను వార్తలు ఔరంగజేబునకు చేరినవి. ఆతని మతోన్మాదము దిగజారినది. కన్నులు విప్పారినవి.

సమయముజూచి కాళ్ళకు బుద్ధిచెప్పినాఁడు. చక్రవర్తి యంతర్ధానముతో సైన్యములకు గుండెలు జారిపోయినవి. ఎటుపోవుటకును మార్గము చిక్కలేదు. రాజపుత్రులు రచించిన వ్యూహము విచిత్రమయినది. సైన్యములకు కోటలోనికి పోవు

టకు తప్ప వేరుమార్గము లేకుండ దిగ్బంధనము చేసివైచిరి. సైన్యమంతయు కోటలోనికి ప్రవేశించినవి. రాజపుత్రులు కోటకు నలువైపులను ముట్టడించిరి. చక్రవర్తి యాశలు నిరాశలయినవి. ఏమి చేయుటకును పాలు పోలేదు. సంధితప్ప గత్యంతరము లేకపోయినది. రాజపుత్రులు సూచించిన నియమముల నంగీకరించుచు పత్రమును వ్రాసి రాజముద్రవైచి తన జ్యేష్ఠపుత్రుడగు మువజ్జముద్వారా దానిని దుర్గాదాసు నొద్దకు పంపెను. దుర్గాదాసు సంధిపత్రమును సేనానాయకు లకు వినిపించెను. దుర్గద్వారములు విస్తృతములయినవి. మొగ లాయీ ధ్వజము దింపివేయబడినది. రాజపుత్రుల ధ్వజము ప్రతిష్ఠితమయినది. ఈ విజయవార్త మార్వాడదేశమంతటను ప్రాకినది. యశోవంతుని పుత్రుడగు అజితసింహుని పట్టాభి షేకమునకు ఏర్పాట్లు జరిగినవి. దేశము నలుమూలలకును ఆహ్వాన పత్రికలు పంపబడినవి.

పట్టాభిషేకమునకు శుభముహూర్తము నిశ్చయింపబడి నది. ఆముహూర్తమున బాలుని సింహాసనమున గూరుచుండ చేసి రాజ్యాభిషేకమును జేసిరి. ఔరంగజేబు స్వయముగ కిరీ టమును బాలశిరమున నుంచవలసిన వాడయ్యెను. సామంత రాజులు నతమస్తకులయి కానుకల నర్పించిరి. ఆసమయమునకు వృద్ధసేవకుడగు నాథూని వెంటనిడుకొని మహేంద్రనాథు లచ టికి వచ్చిరి. ప్రజాసమూహమంతయు నతని కభివాదమొనర్చి నది. నాథూయశోవంతు డర్పించిపోయిన ఇనుపపెట్టెను తన

స్వామియధీన మొనరించెను. నిండుసభలో దుర్గాదాసు దాని నజతసింహుని చేతనుంచి మహారాజు యశోవంతసింహుఁడు దానిని ఏపరిస్థితులలో చంపావతుసింహుని చేతనుంచెనో, దాని నిచ్చు నపుడాయన యేమి చెప్పెనో దానినంతను అచట ప్రజానీకమునకు వివరించెను. అజితసింహుఁడు గౌరవముతో దానినందుకొని కన్నుల కద్దుకొనెను. మరల దుర్గాదాసు చేత నుంచి దానిని తెఱచి చూచుట కాజ్ఞనిచ్చెను. దుర్గాదాసు దానిని తెఱచెను యశోవంతసింహుని కిరీటము, రాజముద్రిక, కొన్నియమూల్య రత్నములు నందున్నవి. దుర్గాదాసు కిరీటమును అజీతసింహుని శిరమునను౦చెను. అజితసింహుని జన్మ మొదలు పట్టాభిషేక పర్యంతము జరిగిన సంఘటల నన్నిఁటిని కన్నులకుఁ గట్టినట్లు ప్రజలకు వర్ణించి చెప్పెను. ఆసమయము నకు దైవయోగమున అజితసింహుని కాపాడిన ముసల్మాను, ఖేబ్ మహాశయుఁడును అచటికి వచ్చిరి. వారి యుపన్యాసము వలన ప్రజల సంశయములు విచ్ఛిన్నములయి పోయినవి. ఆ వీరమూర్తి సాహసకార్యములకు ప్రజలనేక ధన్యవాదముల నర్పించిరి. "యశోవంతుని రాజ్యమునకును వంశమునకును రక్షకుడు దుర్గాదాసు కదా" యని నలుగురు ననుకొనిరి.

మరునాడు జరిగిన మహాసభ యొక్క పెండ్లి పందిరి. ఎవరి కన్నులఁ జూచినను వెలుగు రేకలే. సుందరవస్త్రధారకులయి ప్రజలందరు పెండ్లికొడుకులవలె నలంకరించుకొని తమతమ యోగ్యతాను రూపములగు నాసనముల నలంకరించిరి. రత్నస్థగిత

స్వర్ణసింహాసనమున జితసింహుఁడు అధివసించి యుండెను. ఆతని పార్శ్వమున ప్రాణరక్షకుఁడగు దుర్గాదాసు నిలిచి యుండెను. ఈ యుద్ధమున సహాయముచేసిన రాజపుత్రుల కందఱికును పరాక్రమానురూపములగు బహుమతుల నందజేయఁబడినవి. వృద్ధుడఁగు మహాసింహుఁడు కోశాధికారిగ నియమింపబడెను. గులాబుసింహుఁడు కరణసింహుడు సేనానాయకులయిరి. గంభీరసింహుఁడును మహారాజునకంగ రక్షకులయిరి. కరణసింహుఁడు సేనాధిపతి యయ్యెను. ప్రజాప్రార్థన ననుసరించి రాజ్యరక్షణ భారమును దుర్గాదాసు తాను స్వయముగ స్వీకరించెను. మహాసింహుని పుత్రికయగు లాలబాను రాజసింహుని పుత్రుఁడగు జయసింహునకిచ్చి వివాహము చేయుటకు నిశ్చయముజరిగెను. లాలబాకు దొరికిన బహుమతులలోనిది సర్వశ్రేష్ఠమయినది. ఆమె కొఱకు జరిగినదానికి ఆమెకు దొరికిన ప్రతిఫలమునకు సరిపోయినది. ఒక శుభముహూర్తమున వారిరువురి వివాహము మహోత్సాహముతో నెఱవేర్చఁబడినది.

ముఖ్యకార్యములు నిర్వర్తింపఁబడిన పిమ్మట దుర్గాదాసునకు అకస్మాత్తుగ అక్బరుజ్ఞాపకమువచ్చినాఁడు. వెంటనే మహారాజువద్ద సెలవుదీసికొని శంభాజీదగ్గఱకొక దూతను పంపెను. కాని యచట చక్రవర్తి తనయుఁడున్నట్లు వార్త రాలేదు. ఆతనిని గుఱించి జరిగిన యన్వేషణలో తెలిసినవిషయమిది. "దక్షిణదేశమునుండి మొగలాయీ సైన్యములు అజమేరు యుద్ధమున చక్రవర్తికి సహాయము చేయుటకు వచ్చి

చున్నవి. అక్బరు ఆసేనల నెదిరించవలయునని శంభాజీనికోరెను. శంభాజీ యాతని సలహాను పాటించినట్లు కనుపించి తుదకు మాటలాడక యూరకుండెను. దీనిమీఁద అక్బరుఖానునకు కోపమువచ్చినది. వెంటనే బయలుదేఱి మక్కా-చేరెను. తుద కచటనే మరణించెను." ఈ విషయము దుర్గాదాసునకు చాల దుఃఖముకలిగించినది. కాని చేయునది మాత్రమేమున్నది? భగ విద్విలాసమనుకొని మనస్సును సమాధాన పఱచుకొనెను. ఖుదాబక్షుఖానును తనదగ్గరనే యుంచుకొని యాతనికి జాగీరు లొసంగి గౌరవించెను. రాజపుత్రునితో నాడుకొనిన భిల్ల పుత్రులను రాజధానికి తీసికొనివచ్చి వారికివలసిన విద్యాసౌక ర్యములను కలుగచేసెను.

దుర్గాదాసు పరిపాలనమున అందఱును సుఖులై యుండిరి. నలుగురకు నుపయోగించు విధానమే దుర్గాదాసు నీతికి మూల స్తంభము. ముసల్మానులు హిందువులును కలసిమెలసి ప్రశాం తముగ జీవింపసాగిరి.

---

## ఎనిమిదవ ప్రకరణము

అజితసింహుని వయస్సు 18 సంవత్సరములు. దుర్గా దాసు గురుత్వమున రాజకార్యనిర్వహణలో సమర్థుఁడయిన

అజితసింహునకు పరులసహాయమవసరము లేకుండ అజితసింహుండు రాజ్యమును నిర్వహించకలడని దుర్గాదాసునకు తోచినది. వెంటనే విక్రమశకమున 1758 లో దుర్గాదాసు మహారాజు అజితసింహునకు రాజ్యభారము నప్పజెప్పెను. అవసరమయిన ముఖ్యసమయములలో అజితసింహునకు స్వయముగ సలహాల నొసంగు చుండెను.

విక్రమశకమున 1765 లో దక్షిణదేశమున ఔరంగజేబు మరణించినాఁడు. ఆతని జ్యేష్ఠపుత్రుఁడగు మువజము ఖాను సింహాసనము నధిష్ఠించినాఁడు. తాతయగు నక్బరునడుగు జాడలలో పరిపాలన ప్రారంభించినాఁడు. హిందూముస్లిములను సమముగఁజూచి పరిపాలన సాగించెను. దుర్గాదాసు ఈవిషయ మును గుర్తించి మరి భయములేదనుకొని సంపూర్ణముగ బాధ్యతను అజితసింహున కప్పగించెను.

అజితసింహునకు సర్వాధికారము చేఁజిక్కుట కోతికి కొబ్బరికాయ దొరకినట్లయినది. ఆతని మనసు క్రమముగ మార్పుజెందినది. న్యాయశాసనము క్రమముగకుంటుపడినది. నిరపరాధులు దోషులయిరి. అనవసరమగుచోట దండనలు మెండయినవి. లాభనష్టముల నాలోచించుకొనుశక్తి క్షీణించి నది. ప్రజలీ పరిపాలనయందు విముఖులయిరి. ఎచటజూచినను అజితసింహుని నిందించువారే. రాజ్యమదమున అజితసింహుని కన్నులు మూసికొనిపోయినవి. చెవులుమాత్రమే పనిచేయు చున్నవి. ఎవరెంతజెప్పిననంతే. మొదటి చెప్పినవాఁడే యథార్థ

వాది. దానిప్రకారము జరిగితీరవలసినదే. స్వార్థపరులగు మిత్రులు చుట్టునుజేరి తమకార్యములకు మహారాజును వినియోగించుకొనుచుండిరి. కట్టుతెగిన ప్రవాహమువలె నజితసింహుని ప్రవృత్తి విశృంఖలమయినది. ప్రజాపీడన హెచ్చినది.

దుర్గాదాసు దీనినిఁ జూడలేక పోయినాడు. తానుపడిన పాట్లన్నియు నిట్లు ప్రజాపీడనకు ఫలించినవని తెలియుటతోడనే యాతని హృదయము తఱుగుకొని పోయినది. రెండు మూఁడు సారులు అజితసింహుని దగ్గఱకు పోయి యుపదేశము లొనరించినాఁడు. కాని యవి వృథాయయినవి. నళినీదళ సంస్థితమగు జలబిందువు గాలితాకున పడిపోయినట్లు దుర్గాదాసునుపదేశములు అజితసింహుని మనమున నిలిచినట్లే నిలిచి మరల నశించి పోయెడివి. క్రమముగ నన్యాయము వృద్ధిచెందినది. దుర్గాదాసు చేయునదిలేక తనకుటుంబమును ఉదయపురమునకు పంపివైచెను. ఈ యన్యాయమునొక్క పరిణామము నెదురు చూచుటకు తాను జోధపురమున నిలిచెను. మనుజుఁడు తాను పెంచినది విషవృక్షమయినను పెఱికివేయుట కొప్పుకొనడు. పెంపకములోని మమకారమట్టిది. దుర్గాదాసు స్వామిపుత్రుడగు నజితసింహు నేమియు చేయఁజాలక చూచుచుండెను. స్వార్థపరులగు మిత్రుల ముందర నీతని యుపదేశములు మంటగలిసి పోవుచుండెను దుర్గాదాసు ఈదురాచారములు చూడలేక జోధపురమును విడిచి పోవలయుననుకొను

చుండెను ఒకనాఁడు అనుకూల సమయమును జూచికొని ఆస్థానమునకు బయలుదేఱెను. మార్గమున నొక వృద్ధసేవకుఁడెదురయ్యెను. ఆతఁడు దుర్గాదాసునందు బద్ధానురాగుఁడు. ఆస్థాన విషయములు చక్కఁగఁ దెలిసినవాఁడు. దుర్గాదాసు ఆగమనమునడిగి తెలిసికొని యిట్లనియెను. "మీరు ఆస్థానమునకుపోకుండుటయే మంచిది. అచట మీకు క్షేమము కలుగదు. స్వార్థపరులగు మిత్రుల సహాయమున మిమ్ములను సంహరించుటకు మహారాజు పన్నాగము పన్నినాఁడు"

"సోదరా! నా వయసు గడిచిపోయినది. ఒకనాఁడు మరణించుట ప్రాణిధర్మమేగదా? క్షత్రియుఁడనయియుండి మృత్యువునకు భయపడుట యోగ్యముగాదు. మృత్యువునకు భయపడి వెనుదిఱిగిపోవుట రాజపుత్ర నామమునకు కళంక పాదకమగును". అని పలుకుచు సింహాగమనముతో ఆస్థానమునకుఁ జేరి మహారాజునకు తన తీర్థయాత్రను గుఱించి మనవి చేసెను. ఆమాటలు విని రాజకుమారుఁడుపైకి "ఆర్యా! మీ వియోగము దుర్భరము, వయసుమీఱినది. తీర్థయాత్రకనుమతి నడుగుటచే కాదనలేక పోవుచున్నాను వెళ్ళిరండు. యావచ్ఛీఘ్రము తిరిగి రావలయునని నా ప్రార్థన" అని పలికెను.

"తమ సెలవు ప్రకారము నడచెదనని పలికి గుమ్మము వఱకు వచ్చి మరల వెనుకకుపోయి రాకుమారునితో నిట్టులనియె. "కుమారా! నాకిప్పుడే ఒక సంగతి గుర్తునకు వచ్చి

నది. కనుక నే నీకోజున పోఁజాలను. యశోవంత సింహ మహా రాజు మరణకాలమున గుప్తధనాగారముయొక్క తాళము చెవిని నాకు స్వాధీనపఱచినారు. దానిని నీకప్పగించి తరువాత వెడలిపోయెదను ఇంతవరకును మీకు ఆనిధిని చూపలేకపోయి నందులకును తాళముచేతిని మీకు స్వాధీనపఱచలేక పోయి నందులకు చాల విచారించుచున్నాను. అని పలికెను. ఆహా! ధన మాహాత్మ్యము.ఆశ అజితసింహుని యుద్దేశ్యమును మార్చి వైచినది. ఆశావశుఁడు గాని పురుషుఁడు పృథివియందుగలఁడా? రాజకుమారుఁడు ఇటు లాలోచించెను.

"దుర్గాదాసు సంహరింపఁబడిన యెడల నీ ధనరాశి నా కెట్లు దక్కును. దీనిని చేజిక్కించుకొనిన తరువాతనే ఈతని సంహారమున కనుకూలమగు ప్రయత్నము చేయ వలయును.

వెంటనే తన మిత్రులకు కనుసన్న జేసెను. రాజాభిప్రా యమును గ్రహించి యొకఁడు సంహారమునకు నియుక్తుఁడగు పురుషు నచటనుండి తప్పించెను. దుర్గాదాసు కపటోపాయ ముచే మృత్యు ముఖముననుండి బయటపడెను. ఇంటికివచ్చి సాయుధుఁడయి గుఱ్ఱము నెక్కి బయలుదేఱుచు "దుర్గాదాసు నీచమరణమును కోరడు" అని మహారాజునకు కబురుపంపెను. అజితసింహు నీసందేశము వణకించి వైచినది. ఏమియుచేయలేక

"దుర్గాదాసు ఎచటకు పోయినను పోనిమ్ము. ఔరంగజేబు వంటి చక్రవర్తిని తిప్పలుపెట్టిన యోధుని మనమునిర్జింపజాలము" అని పలికెను.

అజితసింహుని స్వభావమునకు విరక్తుఁడయి తానొన రించిన స్వార్థత్యాగమునకు, దిగంతవిశ్రాంతమయిన యశస్సు నకు ప్రతిఫలముగ నిరాదరణనుపొంది ఉదయపురమునకు వెడలి పోయెను. రాజసింహుని మరణానంతర మాతని పుత్రుఁడగు జయసింహుఁడు సింహాసనము నధిష్ఠించెను. అజితసింహుని వ్యవహారమును విని జయసింహుఁడు కుపితుఁడయ్యెను. వాని తోడి మైత్రివదలివేసెను. దుర్గాదాసును స్వకుటుంబస్థునిగ గౌర వించి యాతనికిఁ గొన్ని పరగణాల నిచ్చెను.

కొంతకాలమువఱకు దుర్గాదాసు ఆతని దగ్గఱ కాలము గడపి ఏకాంతవాసము కొఱకు ఉజ్జయిని చేరెను అచట మహా కాళేశ్వరస్వామి నర్చించుచు స్వర్గస్థుఁడయ్యెను. యశోవంతసిం హుని పుత్రులను రక్షించి మార్వాడ రాజ్యలక్ష్మియొక్క మానమును నిలిపి హిందుముస్లిముల శాంతజీవితమునకు కృషి సలిపిన దుర్గాదాసు శరీరము నేఁడు క్షిప్రానదీతీరమున చితినధి రోహించినది. అహో ! విధివిలాసము.

ఓం తత్సత్.

